శ్రీగురవే నమః

# విహారాండభారతి

ఆంగ్ల మహాకవి, షేక్స్పియర్ విరచితమగు
'టెంపెస్ట్' అను నాటకమున కాంధ్రీకరణము.


గ్రంథకర్త

నీతిమీమాంసాది బహుగ్రంథకర్తలును,
హైదరాబాదులోని నిజామ్ కాలేజి యందలి
ప్రధాన సంస్కృతాంధ్రోపాధ్యాయులు నగు

**రాయప్రోలు వెంకట రామ
సోమయాజులుగారు,
గుంటూరు.**



మొదటి కూర్పు 500 కాపీలు.

గుంటూరు, చంద్రికా ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడినది.

**1928**




[వెల రు. **0-12-0**

# PREFACE.

I venture to place this Telugu rendering of the famous drama known as ' **The Tempest** " of the most famous poet of the West, Shakspere translated in a way that can appeal to Telugu public. Especially this is meant for the educated Telugu females. I have used poetry as little as possible. I place it before the public with the humble hope that I shall rouse in the minds of readers some eagerness to set right the drawbacks in our present Sociological conditions and to pursue an ardent study of this new all-embracing science.

*A moral worker,*

**R. V. Somayajulu.**

శ్రీగురవేనమః

# మహాగాండభారతి.

—: నాంది :—

ఉ॥ శ్రీరమణుల్ జగజ్జనన రీతికిఁ బైని విజృంభణాదిన
త్కారణ కర్మసుస్థితికిఁ, గారణమూలముఁ జేరుచుంటకుం
గారకులౌ కళాధరులు కర్మఫలప్రదులై విభూతులన్
భారతిఁ గన్నమా ప్రబల భారతభూమికి నే భజించెదన్.

(నాంద్యంతమున)

సూత్ర:—నటీ! ఈ జాగేల?

నటి:—ఈజాగు నాదనుకొంటిరి గాఁబోలు. ఈ మననాటక పాత్రభాగములలోని ప్రస్తుతాంకుర వనమాలలు వారి యుల్లములందు స్వస్వవాసనానుసారముగ స్ఫురించుచు నపుడు సాగనిచ్చుటలేదు.

సూత్ర:—అల్లు స్ఫురించుటకుఁ గారణ మేమైయుండును.

నటి:—దేశకాలపాత్రచింతలు పాత్రచింతలకుఁ జోటిచ్చుటామె.

సూత్ర:—అట్టిచోఁ గవి గ్రుడ్డిగవ్వయుం జేయఁడనియే నీ యభిప్రాయమా?

నటి:—కవుల దేమున్నది ? విమర్శకు లెట్లుత్రిప్పిన నట్లే కీలు బొమ్మలవలెఁ దిరుగుచుందురు, లేచుచుందురు, పడు చుందురు; దూషణభూషణముల రెంటిని సమబుద్ధిఁ జూడనియెడ వీరిగతి దుర్గతియే ! విమర్శన గ్రంథముల వ్రాసినచో, ఒకయూరు పట్టనన్నింటిని వ్రాయఁ గలరు; జన్మశతంబునకును బూర్తిఁగాజాలనన్ని గ్రంథ ముల వ్రాయఁగలరు. షేక్స్పియరుగారి నాటకముల మీఁద నెన్నెన్ని విమర్శన గ్రంథములు పుట్టలేదు! విషయం బెంతయక్లిష్టమైనను, తుచ్ఛమైనను, భాషాభి మానులు పెంచిపెంచి వ్రాయం జొచ్చునకుం గఱు వగునా ?

సూత్ర:—రాజ్యచక్రము వ్యాపించుదినములలో నెట్టికవులకును బుద్ధివ్యాప్తి హెచ్చియుండు. కావున, వారినాటకాది కావ్యములందుఁగూడ రుచులు హెచ్చియుండును. విమ ర్శకులును దత్తద్విషయములను పుష్టీకరించుచు విపుల వ్యాఖ్యలవ్రాయుదురు. షేక్స్పియ ర్నాటకము లట్టి సందర్భముల నంకురించినవి. సీలీగారి "ఆంగ్లవ్యాప్తి" యను చారిత్రక కావ్యమునందు నెన్ని రహస్యాంశ ములు కలవో మీరెఱింగిన విషయమేగదా !

నటి:—మొదటనే మనవిచేసితినిగదా ! చిత్తవాసన లెట్లుండునో అభిప్రాయములును దదనుకూలములే యైయుండును.

సూత్ర:—సర్వజన సమాదరణీయాంశములలోను వాసనావశ త్వము తప్పదా ?

నటి:—అట్టియంశ ముండుటయే యసంభవము. ఒకవేళఁగొంత వఱకు నట్టియంశ ముండెనా, అదితప్పక వాసనావాతూలహతికి వశ మైతీరుననియే చిత్తమీామాంసాపారీణుల యభిప్రాయమని మీారే సెలవిచ్చియుంటిరిగదా!

సూత్ర:—అవును. కవిగోడు కవిది; విమర్శకుల పిచ్చులు విమర్శకుల కానందదాయకములు. ప్రస్తుతము మనగోడు మనది. కాన, మనము ప్రదర్శింపఁగడంగిన మిహిరాండ భారతీలీలకుం బూర్వపీఠిక సాగింపుము.

నటి:—ఇదివఱకే సాగినది. స్పెయిన్ రాజ్య చక్రౌన్నత్యమును వంచించిన మనయింగ్లీష్వారి రాజ్య చక్రాంకూరము మొలచు దినములలోనేకదా యీా షేక్స్పియర్గారి రూపక రచనాటోపము. వారి టెంపెస్టనురూపకమునె మన యీా యాంధ్రదేశభక్తుఁడు భారతీలీలలం జూపుటకు, ముఖ్యముగ మాకు నుపయోగించునట్లుగ ననువదించెను.

సూత్ర:—పురుషప్రేక్షకులకు నుపయోగింపదందువా ? ఏమి ?

నటి:—హూణభాషాగ్రంథ సముద్రమధ్యమున నూపిరి సెలిపినంగదా ! అదియునుంగాక, ఇది దాదాపుగ వచనరచనయే యనవచ్చును. కావున, దీనిమూలముననే మా ప్రసిద్ధాంగ్లకవియొక్క రూపకరసముంగొంత వఱకుం గ్రోలవచ్చును. కావున నే నేనిట్లంటిని.

సూత్ర:—నాటకము లన్నియు గానరసమయములై వందల కొలఁది వెలువడుచుండ నే నీనూతనవచనరూపక

ప్రయత్నము ప్రదర్శించుటలో నీసామాజికులనుగాని చదువరులనుగాని మెప్పించుట దుస్తరమె కాదగునని వెఱచుచునె యున్నాఁడను. వచనరచనయె నైసర్గిక సంభాషణ ధోరణియని నా యభిప్రాయము; కావున, ఆంధ్రీకరింపఁబడిన గాన భాగములు తప్ప మిగిలిన దంతయు వచనమే. క్రొత్తయొక వింతకదా!

నటి:—ఓహో! ఇది యొక క్రొత్తపిండివంటయా!

సూత్ర:—పిండియు నేయియు సర్వత్ర దొరుకువస్తువులే; ముఖ్యముగ గుంటూరు నేతికిఁ బ్రసిద్ధికదా! కానిమ్ము; ఉన్న పాకవైచిత్ర్యములలో నిదియు నొకటి.

నటి.—రాజకీయకల్లోలములతోఁ బేరందు నీ గర్తపురికి మీ చప్పటి రచన రుచింపకయే పోవచ్చును.

సూత్ర:—కల్లోలములన్నియు సాంఘికములే. అన్నియు నీ నైసర్గికవాతూలకల్లోలములవంటివే.



# ప్రథమాంకము.

[ సముద్రమధ్యమున నొక దీవియందలి గుహ ]

( పరాత్పరుఁడును, భారతియుఁ బ్రవేశింతురు. )

భారతి:— శ్రీ శివా! ఏమి యీ వింత కల్లోలము! సతికిం బుట్టినిల్లై, సమస్తమహానదీమతల్లికలకుం బతియై యఖిలరత్నములకుం దగ్గని గనియై వెలయు నిమ్మహోదధియాటోపము నిట్టి సమయములం జూచిన నెవ్వ రాశ్చర్యభయభ్రాంతులు కారు! రంగత్తరంగ కల్లోలితమగునీటిపై గభీరములయ్యు నీ మహానావ లెట్లు తల్లడిల్లుచున్నయవి! అనుక్షణమును సమస్తయంత్రసాధన సహితములయ్యు నీపాథోనిధిలోని నావ లెట్లాహుతి కాఁబోవుచున్నట్లు కానంబడుచున్నయవి! కొన్ని నావలు మునిఁగి తిరిగి లేచుచున్నట్లు దూరదృష్టికిం దోఁచుచున్నవి. కొన్ని నిశ్చయముగ మునుఁగుచున్నవి; మఱికొన్ని మునిఁగినవి; గనుకనే యీ సుడిగుండము లేర్పడినవి. అదిగో నాయనా! ఆ యోడస్తంభముమీఁదఁ జేరి కొంద రేఁడుచున్నట్లున్నయది; చూచితిరా?

పరా:—ఔనే! భారతీ! ఆ యీఁదుచున్నవారు మనవంటి మర్త్యులే.

భా:—నాన్నా! వారి దుర్గతిఁ జూచుచున్నను, నీకు జాలిపుట్టకున్నదేల? అదిగో! చూచుచున్నారా! ఆ యోడ

సహస్రశకలములు కాకతప్పదు. అందలి కర్ణధారా
దులును సముద్రయాయులును దప్పక యమనిలయ
ముం జేరఁగలరు. నాకే నీ మంత్రశక్తి యున్నయెడ,
నే నా యోడల కీపాట్లు రాకుండఁ గాచుచుంటిని.

పరా:—బిడ్డా! దిగులుపడకుము. దిగులుపడకుము. ఆ నావల
లోనివారి కావంతయు వంత కలుగఁబోదు. మరుద్దేవ
తలకు నేనట్లు ఖండితముగ నాజ్ఞచేసినాఁడను. నే
నాడించు నీనాటకము భారతీ! నీ కొఱకే. ప్రత్యక్ష
ముగఁ గష్టములం జూచుటచే నీవు సాధించిన శాస్త్రజ్ఞా
నము సార్థకమై యుత్తమానుభవము నీకుఁ గలుగఁ
గలదు. యుద్ధములందుఁ బోరాడుచుఁ గ్రోధాదులకు
వశమై కసినిఁ బెంచుకొనువారికంటె దూరమునుండి
గమనించు మధ్యవర్తులు మొదలగు నితరులకు ధర్మా
ధర్మవిచక్షణయందు నేర్పు బలవత్తరమగును. అట్లె
యీ సముద్రమధ్యమునం గ్రుద్ధవీచీకల్లోలములంతోఁ
బోరుచున్న యీ నావికులకును బుద్ధికి శాంతి చిక్కక
క్రిందు మీఁదగు చుండుటచే నిప్పుడు స్ఫుటముగ
నీతులు స్ఫురింపకున్నను గొన్నికొన్ని యంకురించి
తుదకుఁ బూర్ణబోధం గల్గించును. ఇఁక దూరము
నుండి చూచుచున్న మనకో, నైజశాంతి కలదు.
కావున నీతులు చక్కఁగ స్ఫురించి మన యనుభవ
జ్ఞానము వికసింప నిట్టివే తగిన సమయములు. నీ నెవ్వ
రనో నీ విక్కడకు నెక్కడనుండి వచ్చితివో నీ వెఱుం

గవు. నేను నీ తండ్రినని మాత్రమే యెఱుఁగుదువు గాని నా మహిమల నెఱుఁగవు. ఈ సౌభాగ్యపు గుహాగృహమే మన నికేతనమని తలంచెదవుగాని యంతకుఁ బూర్వము కొన్నియేండ్లక్రిందటి మన స్థితిగతులను నీ వెఱుఁగఁజాలవు; ఏలన నీ వప్పటికి మిక్కిలి చిన్న బిడ్డవు.

భా:— నాకుఁ జక్కఁగా జ్ఞాపకమున్నది నాన్నా!

హరా:— ఎట్లు! ఏమని? భారతీ! నీ కేమేమి జ్ఞాపకమున్నదో చెప్పుము.

భా:— నా కప్పటి విషయ మంతయుఁ గలవలెఁ గొంత కొంత స్ఫురించుచుండును. నాక్రిందఁ బనికత్తెలు నల్వురైదుగురు పూర్వ ముండెడివారు కారా?

హరా:— ఔను. ఉండిరి. నల్వురైదుగురేల! దాసీజనంబు లనేకు లుండిరి. నీ కీవిషయ మెట్లు జ్ఞప్తికి వచ్చుచున్నదో, చూడ నాకు వింతయగుచున్నది. నీ వెట్లీస్థలమునకుఁ దేఁబడినది యెఱుఁగుదువా?

భా:— నా కంతకు నెక్కువ యేమియు జ్ఞప్తిలేదు.

హరా:— భారతీ! కొంతకాలముక్రిందట నే నొక గొప్పపదవి ననుభవించితిని. నీవే యామహాపదవి ననుభవింపఁ దగిన బిడ్డవై యుంటివి; నాకు వేరుగ సంతసులు లేకుండిరి. అప్పు డీశ్వరలీల మాచే నొకనాటకము నాడించెను.

భా:— అప్పు డేమిసంభవించె? నాన్నా!

పరా:—నే నైహికసామ్రాజ్యమును సరకుసేయక జ్ఞానాభివృద్ధికై సత్సంగాసక్తుఁడనై పాటుపడుచుంటిని. నాదాయలదియే సమయమని యీయైహికపదవినుండి మనలను దొలఁగించిరి. ఈశ్వరుఁడు గీతలలోఁ జెప్పినట్లు, "ధ్యాయతో విషయాన్ పుంసః సంగ స్తేషూపజాయతే। సంగాత్సంజాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే। క్రోధా ద్భవతి సంమోహః సమ్మోహాత్ స్మృతివిభ్రమః। స్మృతిభ్రంశాత్ బుద్ధినాశో బుద్ధినాశా త్ప్రణశ్యతి॥" అనఁగా విషయసుఖములనే తలంచుచుంటచే వానిలో మనస్సునకు సంగము కలుగును, సంగమువలనఁ గామము పుట్టును; కామము వలన దానినే కోరు నితరులమీఁదఁ గ్రోధము గల్గును; క్రోధాతిశయముచేఁ జిత్తమునకు సమ్మోహము గలుగును; సమ్మోహముచే స్మృతి చెడును; స్మృతి చెడుటచే బుద్ధిబలము నశించును. దానిచేత నాశము సంభవించును. పామరులి ట్లీప్రపంచపు విషయసుఖములనే నమ్మి తుద కీశ్వరగీతలలో నున్నట్లు చెడుచుందురు.

భా:— తండ్రీ! మనకి ట్లీయన్యాయము నెవరెవరు చేసిరి?

పరా:—అమ్మాయీ! మాలిన్యహీనపురికిం గొన్నియేండ్ల క్రిందట నేను రాజనై యుంటిని. యంత్ర తంత్రమంత్ర విద్యలయందుఁ గొంతపరిచయ ముండుటచే నా యా గ్రంథములమీఁద నాకు నభిరుచి హెచ్చెను. ఎల్లప్పుడును ధ్యానము చదువుమీఁదనే. తమ్ముఁడగు నంధ

నరునకు (నాంటోనియోకు) రాజకీయవ్యవహారముల నన్నింటి నొప్పగించి యుంటిని. ఇట్లు సమస్త రాజ్య భారమును దానే వహించుటచేత, "ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే" అని గీతలలో నున్నట్లే యీతనికి నా రాజ్యము నపహరింప దుర్బుద్ధి పుట్టెను. నాకుం బూర్వమునుండి శత్రువగు నవపురీశునితో నితండు గలసికొని యతని సాయముతో నన్ను రాజ్యసింహాసనపరిభ్రష్టునిం జేసి తానే గద్దె యెక్కెను.

భా:- అంతట మనల నుభయులను జంపం బ్రయత్నించికూడ నుందురు కాంబోలు.

పరా:-ప్రయత్నించిరి. కాని యదివారికిఁ దరమా ? ప్రజలు నన్నుఁజేయు గౌరవమును, నాపైనఁజూపుభక్తియును జూచి మనజోలికి రాఁజాలకుండిరి. నాతమ్మునికి భయ మెక్కువగ నుండెను; కావున, మనల నొకమహా నావలో నెక్కించి సముద్రముపైనం గొంతదూరము సాగినమీఁదటఁ బనికిమాలినతొట్టిపడవలోనికి నెట్టిరి. దానికిం దెరచాపకాని చుక్కాని మొదలగునవిగాని లేకుండెను; కాన నంబుధివీచీవశులమై మునిఁగి చత్తుమని వారలెంచిరి. నన్ను నమ్ముకొనియున్న సామంతుఁడగు కాంచ్యుఁడు రాఁబోవుకష్టముల దూరదృష్టితో నాలోచించి, కొన్ని భోజనభాజనసామగ్రులను, గ్రంథములను, పడవలో నుంచెను. రాజ్యముమీఁదఁగూడ

నాకుఁ బుస్తకములమీఁదఁ గల ప్రీతి లేదని యీ సామంతుఁ డెఱింగి యుండెను.

భా:— నాయనా! శిశువునగు నేను నీకాసమయమున నెంతటి వ్యథ కలిగించియుందునో గదా!

ఫరా:—లేదు. ఇదియంతయు లీలామయమని యెఱింగిన నాకుం గష్ట మొకటియుండునా? ఉపాధివశమగు నీమీఁది ప్రేమ స్ఫురించియుండకపోదు; సంతానవంతుల కిట్టి ప్రేమయే శిశువుల మందస్మితములను, వచ్చియురాని తొట్రుపడుమాటలను, బని తోఁపని యాటలను జూచి చూచి యానందించునట్లు చేయుటయేగాక, కష్టలేశమును మనస్సులకు స్ఫురింపనీదు. కాంచ్యుఁ డుంచిన తిండిసరకులు మన మీద్వీపముం జేరువరకు సరిపోయి నవి. ఈదీవిం జేరి నీకు విద్యాబుద్ధులం గఱపుచు నింతవఱకుం గాలముం గడపినాఁడను. నీవును నేను జెప్పి నట్లు విని నా ప్రయత్నముల సఫలములం జేసితివి.

భా:— తండ్రి! నీదయకుఁదగిన కృతజ్ఞతను నే నెట్లుచూపఁ గలను? కాని, ఈ మహావాతాడంబరమును నీ వేల కల్పించితివో చెప్పకుంటివికదా?

ఫరా:—దీనిచేత, నాయెడవిరోధబుద్ధినిఁబూని యిట్లు చేసినవారల నీ దీవిమీఁదికిం గొట్టుకొనివచ్చునట్లు చేయుటకే. నీకు నిద్రవచ్చుచున్నట్లున్నది. నిద్రపొమ్ము. ( అని మంత్ర దండము పైనఁద్రిప్పును. )

[ తుపానులో నున్న సముద్రము. ]

( ఇళాంశుఁడు, శివాస్త్యయనుఁడు, అంధనరుఁడు, నాంచ్యుఁడు, నౌకాధిపతి, కళాసిమేస్త్రి మున్నగువారు నావయం దుందురు. )

నౌకాధిపతి:— ఎక్కడనున్నావోయిమేస్త్రీ ! బోటుమేస్త్రీ !

కళాసిమేస్త్రీ:— ఇదె ! వచ్చుచున్నాఁడ, దొరగారు ! ఏమి సెలవు ?

నౌ:- మంచిది ! కళాసులకు జాగ్రత్తతో నరిత్రములను సాగింపుఁడని చెప్పుము. పొరపాటుచేసిరా, నావ మునిఁగినట్లే పోమ్ము; త్వరచేయుము.

( కళాసులు ప్రవేశింతురు. )

క॥మే॥:- వేయుండి ! వేయుండి. దిగులుపడవద్దు; పై తెరచాప దింపనేమి ! అశ్రద్ధ చేయకుఁడు. నౌకాధిపతిగారి యీలలను గమనించి చురుకుగాఁ జెప్పినట్లుచేయుఁడు. ఒడ్డునకు నెట్టఁబడనీకుఁడు. జాగ్రత్తసుండి.

ఇళాంశుఁడు:— మేస్త్రీ ! జాగ్రత్తసుమీ ! జాగ్రత్త. కెప్తా నెక్కడ ! వేయు మను. వేయు మను.

క॥మే॥:- మీరు క్రిందికి బోయినఁ జాల మేలు. క్రిందికిఁ బోకురూ ?

అంధనరుఁడు:- కెప్తా నెక్కడ? కెప్తా నెక్కడ?

క॥ మే॥:—ఆయనమాట మీకు వినఁబడుటలేదూ ? మాపనికడ్డము రాకుండి. క్రిందిగదులలోనికిం బొండి, పొండి. ఈ తుపానుకంటె మాకు మీతోడి చిక్కు లెక్కువైనవే; సరె. బాగె.

కాంచ్యుఁడు:—ఏమయ్యా ! తొందరమాట లాడెద వేల ? శాంతము ; శాంతము.

క॥ మే॥:—సముద్రనికి శాంతము ముందుగఁ జెప్పుము. మీరు, మీరాజులు మాకు లక్ష్యమిత్తరిలేదు. పొండి. క్రింది గదులకుఁబొండి చుప్ ! మా కిప్పు డడ్డమురాకుండి.

కాంచ్యుఁడు:—మంచిమాటయేకాని, నావలోనున్నది రాజుగార్లని యెఱుంగుదువా ?

క॥ మే॥:—నాప్రాణముకంటె నెక్కువవారుకాదు. నీవు వారి ప్రధానివేకానీ. నీ వీపంచభూతప్రళయాడంబరమును గద్దించి, ప్రస్తుతశాంతింగల్గించునెడల, ఆపై నిముసము మే మొకత్రాడైన ముట్టము. నీయధికారము సాగింపుము. నీచేతంగాదా, ఇంతవరకు గొంతులో నూపిరి దక్కినందుకుఁ గృతజ్ఞుండవై, మొదలక క్రిందిగదిలోనికిం బోయి కాలము తప్పివచ్చినదని; ఏమో ఏయాపత్తులు రానున్నవో, సిద్ధపడుఁడు.తొందఱపడి లాభము లేదు. మాట వినుండి, మాట విని అడ్డములు రాకుండి.

( అని తనపనిమీఁదం బోవును.

కాం:- వీని మాటలు నాకుఁ గొంత ధైర్యము గలిగించుచున్నవి. వీని చూపులలో నురిశిక్షకుం గూడ వెలువని వాని వైఖరి యున్నది; వీనికి మునుఁగుటయన భయమెట్లుండు. ఈ యోడచాపత్రాడే వీనికి నురిత్రాడు కాఁదగుంగాక! ఈ యాపద తొలఁగుఁగాక (అనుచు గొణుగుచుం బోవును.)

క॥ మే:-(తిరిగి వచ్చి) పై స్తంభమింకను దింపరేమి? దింపరేమి? ఊఁ. దింపుండి, దింపుండి. పెద్ద చాపతో గాలినెట్టినట్లు సాగనిండు. (లోపల, అరుపు వినఁబడును.) మహామారి, ద్రిం............, మీ యరుపును,...........వీరి రొద యీ తుపానుచేయు తొందఱనుగూడ మించుచున్నదే. మా పని సాగనీరే, వీరు? తిరిగి పైకివచ్చినారలుకాదూ? ఏమి మీకు వినఁబడినది? ఏమిటి? ఈ యంత్రములను బారవైచి మునుఁగుమందురా, యేమి? మునిఁగి పోఁదలఁచితిరా, యేమి? చెప్పినమాట వినరుగా?

శివాస్త్యయనుఁడు:-నీ నోటఁ బుండుపుట్ట! మర్యాదయెఱుంగని వదరుబోతు పశువా!

క॥ మే:-అట్లయిన మీరే వెలుఁగఁబెట్టుఁడు.

అంధ:-నీ గొంతుకోయ! నోరుమూయి! వదరుబోతు టహాంకారీ! మునిఁగిపోవుటకు నీకున్నంతటిమాత్రము తెగింపు మాకు లేదనుకొంటివిరా?

కాం:- వీఁడు మనలను ముంచెడునట్లు తోఁచెడు. ఎట్టి చిల్లి బొచ్చైయైనను, ఎంత దుర్బలమైన యోడనైనను, వీఁడు రక్షింపఁగలఁడు.

క॥ మే:- రెండు తెరచాపలను చెఱచి, సంద్రము వైపుగ నావను సాగనిండు; సాగనిండు.

కళాసులగుంపు:-(తడిబట్టలతో వచ్చి) ఇంకేమున్నది? కొంప మునిఁగె. కొంప మునిఁగె. ఇఁక నారాయణ స్మరణ చేయుఁడు.

క॥ మే:- వీరి దేహాలు చలువలు గ్రిమ్మవలసినదే?

కాం:- రాజుగారును, యువరాజును నారాయణ స్మరణతో ధ్యానించుచున్నారు. మనగతియు నంతటిదే. మనము నష్టుచేయుదముగాక!

శివా:- నాకు శాంతి పోయినది.

అంధ:- ఈ త్రాగుఁబోతులు మన ప్రాణములకు మోసము తెచ్చినారు. ఈ దొంగకు నావికాచార్యమునకు విహితమగు మరిశిక్షను విధించిన నా కసి తీరును.

కాం:- ఏనికెక్కిన మరిశిక్ష తప్పదు.

(లోపల గందరగోళపు శబ్దము)

ఈశ్వరా! మాపైనఁ గనికరింపవా!

మనయోడ బ్రద్దలాయె. బ్రద్దలాయె. నా ప్రాణనాయకీ! ఇదె పరలోకద్వారమున మన్నాఁడను. బిడ్డలారా! ఇదె నా కడసారిచూపు. సోదరుఁడా! ఇదె కట్టకడపటి సెలవు; పగిలె, పగిలె, పగిలె......

అంధ:- రాజుతోఁగూడ మనకందరికి మరణమే యిఁక శరణము.

శివా:- ఇఁక రాజుగారితోఁ దుట్టతుదిసెలవు పుచ్చుకొందము గాక! (అని తెరలోనికిం బోవును).

కాం:- ఇప్పుడు నా బుద్ధికిఁ బెక్కువేల చతురపుఁ గ్రోశముల సముద్రము కంటె నెక్కుయకరపు టూమరక్షేత్రమైన మెఱుఁగని గాన్పించుచున్నదిగదా! గోష్పాదమంతటి గొడ్డుబోతు నేలయైన మెఱుఁగే. యశోదా కృష్ణా! ఈశా! నీ యాజ్ఞయే మాకు శరణ్యము. ఈశ్వరేచ్ఛ యెట్లున్నదోగాని, నాకు నీటిలోనిచావుకంటె మెట్ట నెట్టులు గిట్టినను మేలనియే తోఁచుచున్నయది.

(అనుచు నిష్క్రమించును)

## రెండవ రంగము.

పరా:- బలె! ఈశ్వరుఁడు నామంత్రశక్తిని నిరాటంకముగనే సాగనిచ్చినాఁడు. నాయెడ శత్రుబుద్ధి వహించినవారి నీ దీవి చేరువకుం దెచ్చుచున్నాఁడు. ప్రస్తుతము నాకు జాతకరీత్యా గోచారరీత్యా మంచికాలముకూడ సమీపించినది. సమయ మనుకూల మయినప్పుడు స్వలాభములఁ దృణీకరింపరాదు. ఈశ్వరాజ్ఞకు విముఖుఁడగుట తగునా?

—♦ పాట ♦—

లాలి భారతీ, (శ్రీ), బాలికా రతీ
లీలఁ గ్రాలు నోకమలనయన పా మ్మరుదు నిద్దురన్ ॥లాలి॥
వేలుదేశముల్, వైరాల తీవ్రతన్
కాలుగేహముల్ గను నశింప నీ, లీల శాంతవై॥ లాలి॥
మోహలోభముల్, కామాదిలోపముల్
నీకుదూరముల్, గనుక నె తగున్ బాల నిద్దురల్ ॥ లాలి॥

ప్రాపంచకదుర్వాసన లెట్టివో యెఱుంగని యీపసి బిడ్డ కెంత త్వరలోఁ గన్ను మఱఁగినది. దుష్టసంస్కారములే శాంతికి గర్భశత్రువులు. నాకు వశుఁడగు నీ భూతాళపతి వచ్చుచున్నాఁడు. రా! ఓయీ! ఆర్యదాసా! రా! రమ్ము! నీ రాకకు నిట నభ్యంతరములులేవు. పసిబిడ్డను నిద్దురఁబుచ్చినాఁడను. కుశలమా?

(ఆర్యదాసుఁ డనుభూతపతి ప్రవేశించును. స్థూలదేహములేక యాకాశవాణియై భాషించును).

ఆర్య:- కుశలమే. అంతయుం గుశలమే. దొరా! నీ యాజ్ఞలకుబద్ధుఁడనై యున్నాఁడను. వాయుస్తంభన, జలస్తంభన, అగ్నిస్తంభనయు నా కవలీలగ వచ్చినవిద్యలు. మేఘములనెక్కి తిరుగుమన్నను నేను సిద్ధుఁడనే. నేనే కాదు, నా క్రింది భూతములన్నియు నీ వశమే.

పరా:- నేను జెప్పినపనిని నీ వాతాడంబరములతో నెరవేర్చితివా?

ఆర్య:- ఆవంతయు హెచ్చుతగ్గు రాకుండ. రాజు నావను ముంచివేసితిని; నలుగడలఁ బిడుగులఁ గురిపించితిని. క్రిందుమీఁదుచేసి, నావలోనివారల నందరిని భయవిస్మయ దుఃఖాక్రాంతులఁజేసి వచ్చితిని. అప్పతి నేఁ జెప్పినగతి వారిం గుప్పలుగూలునట్లుచేసి తనపాశశూలాడంబరముచే మించిమించి, మించుతీఁగలమంచుచే వారిని ముంచివైచె.

పరా:—నిర్జరక్షీరా ! నీయీ హుటాహుటిధాటికి సోలిపోనివాఁడుండునా ?

ఆర్య:— ఒక్కనికిని జీవితాశ లేనియట్లే తలంపు. నిలింపుల తలంపులకు నడ్డుచెప్పువా రెవరు ? నావ నడుపు నావికులు తప్ప మిగిలిన వారందఱుం గ్రిందుమీఁదైరి. ప్రతినందుని యవస్థ వర్ణింపఁ దరముకాదు. మొదట సముద్రపు దీర్ఘనిద్రంగూర నెంచి దుమికినది యాతఁడే. నిరయంపుదయ్యంబులన్నియు సరయంబుగఁ దమ నిలయంబుల విడిచి తమ్ముఁ గ్రమ్ముకొన్నట్లేడువఁ దొడఁగె.

పరా:—నీవు కలిగించిన యీ మోసంపుతొందఱ సముద్ర తీరంబునుందరఁగాదా యేమి ?

ఆర్య:—నీకుఁ దెలియనట్లు నటించెద వేమి, దొరా ? తీరమందే.

పరా:- వారందఱు కుశలమేకదా !

ఆర్య:—ఎవ్వరికి నిసుమంతయుఁ గసటు కలుగనీక యీదీవిం జేర్చితి. మునుపటికంటె నిప్పు డెక్కువగ వారిమోములు కళకళలాడుచున్నయవి. ఈమూలఁ గొందరుఁ

ళమూలఁ గొందఱుఁ, గూడి తాముపడిన యిడుము
లం గురించి ముచ్చటించుకొనుచున్నారలు. రాజుగారి
కుమారునిమాత్ర మొంటరిగ నొకమూల నిట్టూర్పుల
విడుచుచు నరచేతుల ముడుచుకొని కూరుచుండఁ
జేసితిని.

పరా:-రాజునావను, నావికులను, తక్కిన నావలగుమిని నీవె
చటఁ జేర్చితివి ?

ఆర్యా:-రాజుగారినావ రేవుచేరి సురక్షితముగ నున్నయది.
ఆనాఁడు వర్మదదీవులనుండి నన్ను సాంబ్రాణిం దెమ్మని
యంటిరే యా రేవుననే. నావికు లెల్లరు సొమ్మసిల్లి
నావగర్భాగారమున గాఢనిద్రఁ జెందియున్నారు.
తక్కిన నావలన్నియు నొకటొకటె కలిసికొని ఇప్పుడు
గుమికూడి రాజునోడకును రాజునకును దమ యాశల
వదలి మధ్యధరాసముద్రముపైన నవపురిమార్గముపట్టి
సాగిపోవుచున్నయవి.

పరా:-నీవు నేఁ జెప్పినట్లే కార్యమును సానుకూలము చేసి
నాఁడవు కాని, మఱియుఁ గొంత నీపని శేషించి
యున్నది. ( పైనఁజూచి ) ఇప్పు డెంత ప్రొద్దెక్కినది ?

ఆర్యా:-ప్రొద్దు తిరిగినది.

పరా:-రెండుగొట్టు సమయము. ఇప్పటినుండి యారుకొట్టు
లోఁగా మన కుభయులకుం జేతినిండఁ బని గలదు.

ఆర్యా:-ఇంకను గష్టపుంబని కలదా ? నీవింతటికష్టము
నావల్లఁ దీసికొనుచున్నావుగాన నీవునాకిచ్చినవాగ్దాన

మును మరువఁదగదుసుఖీ. ఇప్పటికిని నీమాట నీటి మూటగనేయున్నయది.

పరా:— ఏమి యిది? ఇట్టికించ తగునా? నీవు వేఁడునది యేది?

ఆర్య:— పూర్ణస్వాతంత్ర్యము.

పరా:— పరిపక్వసమయము రాకముందే? ప్రస్తుతము పురాణము కట్టిపెట్టుము.

ఆర్య:— నామనవి యింతమాత్రమే: నీకుఁదగిన సేవాసహాయములం జేసితిననియు, ఒక్క కల్లనైనను జెప్పనొల్లకుంటిననియు, నాపాటులో నొక పొరపాటునైనను రానీకుంటిననియు, ఒక్కసారెను గొణుగక, విసుకుపడక పనిచేసితిననియు, జ్ఞాపకముంచుకొనుము. నాకొక్క సంవత్సరమునకు సెల వొసంగుదునంటిరికదా!

పరా:— నిన్నెట్టిబాధలనుండి కడఁదేర్చితినో, మరచితివా?

ఆర్య:— లేదు.

పరా:— నీవు మరచినట్లే తోఁచెడి. వాయుపృథివ్యాపోభూతములందు నీచేసినపనులంతగొప్పవియే? నిజముగఁ జెప్పుము.

ఆర్య:— కావు దేవరా.

పరా:— త్రికరణశుద్ధిగ నీవుపల్కుట లేదు. చిక్కరక్కసిమహాకాళివలె బలిసిపెట్టిన యిక్కట్టుల నెట్టుల మరువఁగల్గితివి? ఆరాక్షసి మరపునకు వచ్చెనే?

ఆర్య:— లేదు, దొరా.

పరా:— నిజమాడుము, నీవు మరచితివి. ఆ రక్కసియెక్కడఁ బుట్టిపెరిగె ? చెప్పు.

ఆర్య:— అల గిరిజాదేశములో, దొరా.

పరా:— అదియాలాగో ! కాని, నీకు నెలనెలకు నీవు పడి మరచిన కష్టములను జ్ఞాపకము చేయుచుండవలయు. ఈరోతజన్మంపురక్కసి చేసినదుష్కృత్యముల కంతు లేదు. అవిమనుజులు విననైనఁ దగవు. అందుచేఁ దద్దేశీయులు తరిమి, యీద్వీపములో దించివైచిరి. ఆమెను జంపుచుండిరే కాని తమనగరరక్షణకు నొక్కతరి యీరక్కసి యక్కఱకువచ్చినదని ప్రాణముం దీయరైరి. ఇది నిజమే కదా ?

ఆర్య:— అవును, దొరా.

పరా:— ఆనీలంపుగన్నుల పెనుబూచినిక్కడవారు దించి పోఁగా నిన్నదిపెట్టిన కష్టాలను మరచితివే ? నీకు వాయులోకంపుకార్యములం జక్కపెట్టుపనులంజెప్పక, నీకు రుచియింపని పార్థివకృత్యములం జెప్పుచు, నీవరుచిఁ జూపఁగా, నిన్నొకదేవదారుకోటరమున బంధింపదే ? నిన్నట ద్వాదశవత్సరంబులు కారాబద్ధుం జేయదే ? ఇంతలో నామెకుఁజావురాఁగా, నీదుర్గతికంతము లేక యాతొఱ్ఱలోనుండి మొఱ్ఱోయని నీవుపెట్టిన మొఱ్ఱలకు నీయఱుపులకును మితికలదే? అత్తరి నిద్దీవి నాకాళీవనుఁడు తప్ప మఱియెవ్వరైనం గలరా ?

ఆర్య:— ఔను. ఆ దిట్టంపురక్కసిమొక్క పట్టి పీడొక్కండే యుండెను.

పరా:— అంత నీ దురంతసంతాపము నాయంతరంగమునకు నెఱుకపడ, నా కదిచేసిన శాబరమునకుం బ్రతిక్రియ తెలిసియున్నదిగాన నిన్ను రక్షింపంగలిగితి. అప్పటి నీ దోషపుల కాయకనియు నాయడవినొకములుకూడం దల్లడలుచు న్నను. ఆనీయవస్థ మహపునకు వచ్చెనా ?

ఆర్య:— దేవరా! ఆ నీయుపకారమునకు నేనెంతయుం గృతజ్ఞుండను. దాని స్మరువఁజాల.

పరా:— ఇంక మీఁద గొణఁగితివా, జాగ్రత్త, నీకుం బూర్వస్థితియే రాఁగలదు.

ఆర్య:— మహాప్రభువు, దొరా. ఇఁకమీఁద నేనిసుమంతయు గొణఁగఁబోను. నీయాజ్ఞల నాయాత్మానములన తాలిమింగొని నెరవేర్పఁగలాఁడను.

పరా:— మాటలతోఁ లాభములేదు. క్రియచేసి చూపుము. రెండురోజులలో నిన్ను వదలి స్వేచ్ఛగాఁ బోనిచ్చెద.

ఆర్య:— నాయేలికకు నామీఁదఁజాల దయకలదు. దొరగారు! నాకేమియాజ్ఞ! దయచేసి యానతిండు. నాకేమిపని యిత్తురు ?

పరా:— క్షీరసాగరకన్యకలవలె రూపముఁ దాల్చి యెవ్వరికిం గానరాక నీకును నాకును గాననగుచుఁ ద్వరగా నా వద్దకు రమ్ము. వేవేగఁ బొమ్ము.

(ఆర్యదాసుఁడు నిష్క్రమించును.)

పరా:— లెమ్ము. బిడ్డా! భారతీ! లే, లెమ్ము. చాలసేపు నిద్దురపోతివి. లే, లెమ్ము.

భార:— నీవు చెప్పుచుండిన వినోదంపుగాథ నాకు గాఢ సుషుప్తి కలిగించినది.

పరా:— నిద్దురమత్తు వదిలించుకొమ్ము. లెమ్ము. కాళీవనునిం జూచివత్తము, రమ్ము. ఈ బానిసెవానినోటం గనికరంపుం బ్రతివచనము రానేరాదు.

భార:— నాయనా! ఈ రక్కసిరండకొడుకును నాకుం జూడ బుద్ధిపుట్టదు.

పరా:— ఇప్పటి స్థితిగతులం బట్టి, వాఁడు లేనిది మన పని సాగదు. ప్రొయ్యి మంటచేయుట, కట్టెలు తెచ్చుట మొదలగు చాకిరి వాఁడే చేయుచున్నాఁడుగదా?

(అంతటఁ గాళీవనునివైపు తిరిగి) ఏమిరా! దాసీపుత్రా! కాళీవనా! ఓరీ మొద్దూ! మంటిముద్దయైనను, నీకంటె నయమే. పలుకవేమిరా?

కాళీ:— (లోపలినుండి) లోపలఁ గావలసినంత వంటచెఱకుం గొట్టవలసి యున్నది.

పరా:— బయటికి రావేమి! నీకు మఱియొక పని చేయవలసి యున్నది యిట. రమ్మిట వేగ, చీమనడకల తాఁబేటి బొచ్చా!

( ఆర్యదాసుఁడు క్షీరసాగరకన్యకల రూపముతోఁ
ప్రవేశించును. )

(ఆర్యదాసుని వంకఁ దిరిగి) ఓ స్ఫురచ్ఛాయారూపమా !
వింతల యార్యదాసా ! చక్కఁగ వినుచుండుము.

ఆర్య:- తమ రహస్యపుటాన వెంటనే చేయువాఁడ.
(అని నిష్క్రమించును.)

పరా:- (కాళీవనుని వంకఁ దిరిగి) ఓరి విషపుచ్ఛపు రండ
కొడుకా ! ఇవతలకు రమ్మన్న రావేమిరా ?
(కాళీవనుఁడు ప్రవేశించును)

కాళీ:- నా తల్లి చావుసకు ముందెట్టి యంత్య శైత్యము
గ్రమ్మెనో, అదే మిమ్ము నిరువురఁ ముంచివేయ !!
ప్రళయవర్షపు గాలి మీ మీఁద వీచి యా మహా
శీతముతో మీ యొడలంతయుఁ బుంగుపడ !!

పరా.- నీ నోరంత క్రొవ్వినదా ? దీనికిఁ దగిన శాస్తి నేఁటి
రాత్రికి నీకుఁ దప్పదులే. నీ డొక్కలు చీల్పఁబడునులే.
నీ గొంతుక కుట్టివేయఁబడునులే. రాత్రియంతయు
భూతాలు చేయితీరని పనితో నిన్నుఁ బొడిచి పొడిచి
బాధింపఁగా నీ యొడ లంతయుఁ దేనెతట్టవలె
బొక్కలు బొక్కలు చేయఁబడునులే.

కాళీ:- నా దినపుఁదిండి తినవలయు. నా తల్లియగు చిక్కు-
రాకుసి తరువాత నీ దీవికి నేనే యధికారిని. నీ విపుడు
బలిమిచే నన్ను బాధించిననేమి. వచ్చిన క్రొత్తరిక
ములో నన్ను గారాబముచేసి కొండంతటి మెత్తున

నుంచి గౌరవించి మంచిమంచి తాయాలుపెట్టి నాల్గు క్రొత్తపేళ్ళు నేర్పి మోసపుచ్చితివి. మోసపోయి నీ వలలోఁ జిక్కి యీ దీవిలోని గనులు, వింతబుగ్గలు, వినోదంపు తావులు, ఫలవంతములగు నేలలు, నాతల్లి గారి సర్వమంత్రతంత్ర రహస్యములును, బుద్ధిలేక చూపించినాఁడను. గడచిన దానికి వగచి ఫలమేమి? మిమ్ములఁ ద్రాఁచులు పీక !! కాటిలో రాబందులు గబ్బిలాలు పీకుకొని తిన !! నన్నీగుట్టమీఁద బంధించి, నిరంకుశాధికారినై యున్న నన్ను మీ బానిసనుగఁ జేసి, కదలనీక మెదలనీక మీ రిట్లు చేయుచున్నారు కదా? మంచిది! మంచిది!

పరా:- నీ తప్పుడు కూఁతలఁ గట్టిపెట్టుము. నీకు దయకుఁ గరఁగు మనస్సులేదు. నీకుఁ గొరడాదెబ్బలే తగును. నీవు వట్టి యశుద్ధ పశుపు వనఁదగినవాఁడ వయ్యును, నిన్నెంతటి ప్రేమతోనో చూచినాఁడ; నా గదిలోనే పరుండనిచ్చితి, ఎంతగనో గారాబము చేసినాఁడ :- నా పసిబిడ్డ బుద్ధినిఁ జెఱుప నీవు యత్నించినంతవరకు.

కాళీ:- పెండ్లియైనం బాగేయగుచుండె. నీవు దుర్మార్గుఁడ వడ్డపడితివి కాని, లేకున్న నీ దీవియంతయు నాబోటి దేవతలతో నింపక పోవుచుంటినా?

పరా:- గండురండ కొడుకా! నీకడుపుమండా! కంచుదివ్వటీలు పెట్టి గాలించినను నీలో మంచి కించిత్తైనను జొరఁబడదుగదా! అడవిమృగమవై యుండ నిన్నుఁజూచి

జాలిపడి, నీకు మాటల నేర్పి, ప్రతిఘటికయు నేదో యొకటి క్రొత్తవిద్య నేర్పుచుంటిని. నోటమాటరాక, యడవిమృగమువలె గుఱ్ఱుగుఱ్ఱుమనుచుండుతఱి నీకు నెంతో కష్టముతో మాటల నేర్పితి. అయినను, నీ జాతినైజ మెక్కడకు వదలిపోవును. నీ విశ్వాసఘాతుకపుబుద్ధి కీగుట్టమీఁది నిర్బంధను తగదా యేమి? నీ కింతకంటెఁ గఠిన శిక్ష విధియింపవలసి యుంటి. పాపము దలఁచి యింతటితోఁ బోనిచ్చితి.

కాలీ:— నీవు భాష నేర్పి చేసిన లాభ మేమి? తిట్టులు తిట్ట నేర్చికొంటిని. నీ భాష నేర్పిన దోషాన నిన్నామహామారి మ్రింగక పోదులే.

పరా:— పోరా! పో! దయ్యపురండాపుత్రా. వంటచెఱకుఁ దెమ్ము. తొందఱగా! నీకు వేరే పనిచేయవలసి యుండును. ఓర్వలేని పొగరుఁబోతూ! ఱెక్కలు జాడించిన లాభము లేదుసుమీ! చెప్పినపనిని నిర్లక్ష్యము చేసినను, లేక, విసుకుకొనుచుఁ జేసినను, నీకు శాస్తి యేమియో నీ విదివరకే యనుభవించి యున్నావు, గాన నెఱుంగుదువు. ముండ్లమంచపుఁ బ్రక్కరుచి నీ వెఱిఁగియున్నావుగదా! నీ యెమ్ముకలఁ బొడిపొడిచేసి, నీ యరుపునకుఁ బెడబొబ్బలకు నడవిమృగము లదరిపడి వడవడ వడఁకునట్లు చేసెద! జాగ్రత్త!

కాళీ:— అంతకోపము వద్దయ్యా. ( తనలో ) నేను లోఁబడి యుండక తప్పదు. వీని యంత్రతంత్రశక్తి యద్భుతము. నే నొక గుహ్యక గర్వమునుగూడఁ బనికిరాను. నే నేల, నాతండ్రితాతల కులదైవతమునుగూడఁ దనసేవకునిగఁ జేసికొన వీఁడు సమర్థుఁడు.

పరా:— జాగ్రత్త ! బుద్ధిగలిగి చెప్పినపని చేయుము. పొమ్ము.

( కాళీవనుఁడు పోవును. )

( ప్రతినందుఁడు ప్రవేశించును. )

[ ఆర్యదాసు తెరచాటునుండి పాడును. ]

పాట. నాట్యమాడి భజనసేయ నడచిరారె యోగినుల్
నిట్యసమవిలాసహాస బింబికాధరోష్ఠలై ॥

1. కాలకాలు సగము మేను గ్రమ్ముకొన్న పార్వతిఁ
కాలుకాలిఁ జేయిచేతిఁ గలిపి భజన సేయుఁడీ ॥నాట్య॥

2. దేవిమీఁద భక్తి నిలిపి దివ్యనాట్య మాడరే
శివి ముద్దు లందుకొనుచు శేవమీరఁ గొల్వరే ॥నాట్య॥

ప్రతినందుఁడు:— ఈ గాన మెందుండి వచ్చుచున్నదో తెలియరాకున్నయది ! వాయుమండల సంబంధియా ? భూమండల సంబంధియా ? అదిగో ! ఇపుడు వినరాదే లోకో ? ఈద్వీపదేవతయొక్క స్తుతి కాఁబోలు. మహాదుఃఖనిమగ్నుఁడ నగు నన్నాకర్షించి పారావార తీర భూమినుండి యింతదూరము వచ్చునట్లు చేసినది. నా తండ్రి నావను ముంచి ఘూర్ణిల్లుచున్న సరిత్పతి లహరీతైక్ష్ణ్యమును నా దుఃఖతీవ్రతను గొంతవరకు

ప్రాణింపఁజేసి యీ మనోహరగానరస మింతవర కీడ్చి కొని వచ్చినది. అయ్యో! తిరిగి వినరా దేలొకో! ఇదిగో! తిరిగి వినఁబడుచున్నది!

ఆ తారాద్రి శ్రీలాంఛనుఁడు; వారాశి
నింబ్వ తెన్నెలను లోతుగా,
ముసుఁగి పడిపోయెఁ గాఁడే, పొగడంపు
తీగె లాతని యస్థులే॥ బాలుఁడా! యేడ్చెదేల.
బాలుఁడా! యేడ్చెదేల? మరువుమా
పడచినట్టివి దుఃఖముల్,
రాఁ బోవు చిరకాలముం
నీ బోట్లు ధైర్యముం విడువఁదగునే?
నీ తారాద్రి నేత్రంబులే, అవదాత
నిర్మలపు తీము త్తెముల్,
అన తయును లేదుగా, నశ్వరం
కానాడబడ శక్తుల౯ ॥ బాలుఁడా ॥
అంతయుఁ బరిణామమే, వ్యక్తమా
జడజీవశక్తిరూపుల్
అంత కంతకు మించునా
విర్భావభూమమే జగమెల్లను ॥ బాలుఁడా ॥
శ్రుతులు సన్నుతులు సేయ౯, తత్వమును
గతి విశేషములఁ జెప్ప౯
సత్యంబు బోధించిరి, మునిజనుల్
శక్తిసేవక యోగినుల్ ॥ బాలుఁడా ॥

ప్రతి:- ఈ పాట నా తండ్రిగారిని గూర్చియే సూచించున ట్లున్నది. ఇది భూమండలవాసుల గానముగాదు. ఇది గగనమార్గమునుండి వినవగుచున్నది.

పరా:- (చేయి యెత్తి చూపుచు) భారతీ, నీ కనుఱెప్పలను విచ్చి యటువైపు బాగుగఁ జూడుము. నీ కేమి గాన్పించుచున్నది?

భార:- ఆకనఁబడుచున్నది యేమొకో? నాయనా, అది దేవతయా? ఆహా! అది యిటునటు నెంత వింతగాఁ జూచుచున్నది? దాని రూప మెంత గంభీరముగ నున్నదో చూడుఁడీ: కాదు. అది తప్పక యొక దేవతారూపమే.

పరా:- కాదమ్మా. మనవలెనే యదియు నాహారనిద్రాదుల నిర్వర్తించును. మన కున్నట్లే, దానికి నింద్రియములు కలవు. నీ విప్పుడు చూచుచున్న యందగాఁడు విరిగిన నావలలోనుండి తప్పింపఁబడి యొడ్డునకుఁ జేర్పఁబడెను. దుఃఖమను దోష మీతని బాధింపకున్న యెడ నీతని యాకారము మిగుల సొగసైనదే యన వచ్చును. ఈతని తోటివా రేమైరో యను దుఃఖములో నీతఁడు మునిఁగియుండి యిప్పుడే వెదుక సాగినాఁడు.

భార:- ఈతని యసామాన్యమగు నాకారపుగాంభీర్యసౌంద ర్యములం బట్టి దేవతాస్వరూప మనవచ్చును.

పరా:— (స్వగతము) ఇది నే నూహించినట్లే పరిణమించుచున్నది. (ఆర్యదాసుతో) ఆర్యదాసా! నీవు నేర్పరివి? నీ నేర్పునకుఁ జాలమెచ్చినాఁడ. నీకు రెండుదినాలలోఁ బూర్ణస్వాతంత్ర్యము దొరుకఁగలదు.

ప్రతి:— ఈపెను గూర్చియే కాఁబోలు నేఁ గ్రోలిన గానామృతము. ఓ దేవతా! నా మనవి నంగీకరింతువా? తా మీ ద్వీప నివాసులే? దయచేసి సెల విత్తురా? నే నిక్కడ నెట్లు ప్రవర్తింపవలయునో నా కాజ్ఞయిత్తురా? (స్వగతము) సంశయింపనేల. నిజ మడుగుదుఁగాక. ఈ యచ్చెరువు గొల్పు బొమ్మ, యొక కొమ్మయో లేక, యీ దివి దైవతమో, నే నెఱుంగదగునమ్మా?

భార:— ఇచ్చట వింతచెందవలసిన దేదియు లేదు. నే నొక కన్యకనే.

ప్రతి:— మా భాషయే! మా భాషయే! ఈ భాష వాడు జనులలో నేను ప్రభువునగుటచే నుత్తముఁడను. కాని, ఈశ్వరా! ఈ భాషను వాడు దేశ మధ్యమున నన్ను తిరిగి వైచిన నే నెంత కృతజ్ఞుఁడ నగుదును!

పరా:— అదెట్లు? నీ వెట్లు త్తముఁడవు కాఁదగును. ఈ మాటను నవపురి రాజుగారు విన్నచో, నీగతి యేమగుచుండెనో? (అని చిఱునవ్వు నవ్వను.)

ప్రతి:— ఇద్దరు రాజు లుందురా? ప్రకృతస్థితిలో నేనె రాజునైతిని. నవపురి రాజును గూర్చి నీవు ముచ్చటించుట చూడ నాకు వింతయగుచున్నది. పరలోకమునుండి

యాతఁడు నా మాటలను వినుచుండవచ్చును. నాకిట్లు చెప్పుకొనవలసి వచ్చెనే యని దురపిల్లుచున్నాఁడను. ఈ రాజు నని చెప్పుకొనుచున్న నేను మున్నీరుగం గన్నీరు కార్చుచు మున్నీట మునుంగుచుండఁ గన్నులారఁ జూడనొల్లక కనుంగనుం జింతించితి. ఇప్పుడే నన్నుఁ బెద్దవానిఁ జేసి నా తండ్రి స్వర్గస్థుఁ డయ్యె.

భార:– అయ్యో : పాప మెట్టియవస్థలు మీకుఁగలిగె ?

ప్రతి:– నిజము చెప్పుచున్నాఁడ నమ్ముఁడీ. నా తండ్రిగారే కాదు, వారిక్రింది సామంతప్రభువగు మలినహీనపురేశుఁడును, అతని ధైర్యశాలియగు కుమారుఁడును మునిఁగి పోయిరి.

పరా:- మలినహీనపురీశుఁడును, అతని ధైర్యశాలియగు కుమార్తెయు నిప్పుడు సందర్శించినయెడ, నీమాటల కడ్డు చెప్ప వెనుదీయకుందురు గాదె. (స్వగతము) ప్రథమదర్శనసంఘటనముందే వీ రొకరినొకరు మోహించిరి. (ఆర్యదాసుతో) నీ యీనేర్పునకుఁ గడుంగడు మెచ్చితి. నీకుఁ దప్పక స్వాతంత్ర్యమిచ్చెద.
(ప్రతినందునితో) అబ్బాయీ ! నీకొక మంచిమాట ! నీకుఁ గొంత మతిభ్రమణము కలిగినట్లు తోఁచుచున్నయది. మాట వినుము బుద్ధిని జలింపనీకుము.

భార:– (స్వగతము) మాతండ్రిగారి కింతటి కాఠిన్య మెందుండివచ్చె ? నేను జన్మమెత్తినది మొదలు చూచిన మూఁడవమానవుఁ డీతఁడే; నామనస్సు నాకర్షించిన

మొదటిమాఱవృండు నీతండే. నా తండ్రిహృదయములో జాలి యంకురించి నా యాశావృంతమున కండయగుం గాక !

ప్రతి:– ఓ ప్రాణపదమా ? నీ వవివాహితవై తివేని, నీవు మఱి యితరునిపై మోహాశాపేక్షణంబులం బ్రక్షేపించి యుండవేని, నామనవి నంగీకరింపుము. నిన్ను నవపురికి రాణింజేయ నుంకించినాండ.

పరా:– అయ్యా, బుద్ధిని పొందరపడనీకుము. ఇంకొకమాట. (స్వగతము) వీ రుభయులు నన్యోన్యమోహావేశపరవశులైరి. ఇంతటి తీవ్రమోహము లయుక్తములు, కావున నే నంతరాయములం గల్పింపవలయును; ఏలన, యద్దానినైన జను లతిసులభముగం జెందినయెడ, దాని విలువ నెఱుంగంజాలరు. (ప్రతినందునితో) నీ కొక మాట చెప్పవలసియున్నది. నీకిచ్చట నాయాజ్ఞ నను వర్తింపక తప్పదు. నీ యధికారము నీ దేశమున నెట్టిదైనను, ఇక్కడ నీ యహమిక సాగదు. చూడంజూడ నిదీవిలో నన్నీ పదవినుండి తొలంగించి నీ స్వాధీనము చేసికొని పోవచ్చిన చారునివలెం గన్పడుచున్నాండవు.

ప్రతి:– అట్లుకాదు. నాకును మనుష్యసామాన్యమగు నీతి లేదనుకొంటిరా ?

భార:– ఇట్టి మనోహరమగు నంతరాత్మాలయమున దోష బుద్ధి యెట్లు దాగంగలదు. ఒకవేళ దోష మొకటిలోం

జొరఁబడఁజూచినను, సుగుణగణములు తమ నిజావాస మున నడుగిడ నిత్తురే?

పరా:– (ప్రతినందునితో) నా వెంబడి రమ్ము. (భారతితో) ఆతనింగూర్చి నీవు నాతో నెన్నికతో హెచ్చరింప రాకుము.

(ప్రతినందునితో) రావేమి? నీకు బండకొయ్యను దగిలించి వైచెద. నీకుఁ ద్రాగుటకు సముద్రపుటుప్పు నీరే యిచ్చెద. పొట్టు, ఎండిపోయిన కందమూలపుబలు మాత్రమే నీ కాహారముగ నిచ్చెద. వెంబడి రా.

ప్రతి:– అది నీతరము కాదనుకొమ్ము. నన్ను జయించినమీఁద సాధ్యమగునేమో కాని, అంతవరకు నీకసాధ్యము.

(అనుచుఁ గత్తి నొరనుండి దూయును.)

(పరాత్పరునిమంత్ర బలముచే నిశ్చేష్టుఁ డగును.)

భార:– నాకుం బ్రియతముఁడవగు నో తండ్రీ! పిచ్చుకమీఁద బ్రహ్మాస్త్ర మన్నట్లు, మిక్కిలి శాంతమూర్తియు నిరప రాధియు నగు నీతని మీఁదనా నీ కోపావేశముం జూపుట?

పరా:– ఏమే? నా పాదాంతేవాసివి నీవా నాకుఁ జదువుఁ జెప్పఁ జూచుచున్నదానవు?

(తిరిగి ప్రతినందునితో) స్వామిద్రోహీ! ఇఁక నీ కత్తిని దాఁచిపెట్టుము. ఏమో శౌర్యమున్నట్లు నటింపఁ బోతివి. క్రియ శూన్యము! ద్రోహము చేసితివని పొడుచుచున్న నీ మనస్సాక్షిని ముందు నీవు జయించి

నం గదా, నా మీఁదికిఁ గాలుద్రవ్వుట. నీ యెదిరింపు నీలుగుం గట్టిపెట్టుము. నిన్నుఁ బాదాక్రాంతుం జేయుట కీ చేతికఱ్ఱ చాలును.

భార:- తండ్రిగారూ! నా మనవి వినరుగా? (అని బట్ట పట్టుకొని వేడుకొనును.)

పరా:- కదలవేమి యిక్కడనుండి? నా బట్టవదలి యటుపద.

భార:- నాన్నగారూ! ఇంచుక జాలిఁబూనుదురూ? అతనికై నేను ప్రాణమీయ నుందును.

పరా:- నోరుమూయి! ఇంకొకమాఱు పలికితివా, నీకుఁ జెంప దెబ్బలు తప్పవుసుమీ! ఏమే! ఈ దొంగకై నీవు వకాలతి పుచ్చుకొంటివే? నోరుమూయి! వీనినిం గా నసుని మాత్రమే చూచి యుంటచే నీ వితనికంటె సుందరాంగు లేరని యెంచితివి కాఁబోలు. బుద్ధిలేని కుఱ్ఱదానా! లోకమందుఁ గొందఱి యందము సుందరమని వీని రూపము నీ కాళీవనుని రాకాసిరూపము వంటి దనవచ్చును. వీనికంటె సుందరతము లెందరో దేవసములు కలరు.

భార:- నా మోహ మంత కట్టుతప్పి దేవతలయెడం బోదు. వీనికంటె నన్యు నందగానిం గన్నెత్తి చూడనొల్ల.

పరా:- (ప్రతినందునితో) కదలి రావేమి! నీ ప్రగల్భము లిక్కడ సాగవు. వెఱ్ఱికుఱ్ఱా! ఇంక నీకు సత్తువ యెక్కడిది లే?

ప్రతి:— మీ మాటలే నిజమైనవి ? కలలోవలె, నా బాహుబల పరాక్రమము లన్నియుం గల్లలయ్యె. (తనలో) నాతండ్రిగారి మృతి, నాకిపుడుగల్గిన దుర్బలస్థితి, నామిత్రమండలియోడలు పగిలి సంభవించిన యనుమితపరలోకగతి, నన్ను వశపరచుకొని బెదరించుచున్న యీ మానిసివలనిభీతి;— ఇవియన్నియు నెంతటిదుఃఖ కారణములైనను, నేఁ బోనున్న కారాగృహమునుండి యొక్కసారి యీ యన్నులమిన్న న్నాకన్నులు చూడఁ గలుగునెడ నంతటి మహత్తర సుఖకారణము లీ లోకమున నాకుండఁబోవు; అట్లైతరి, నా కారాగృహ బహిఃప్రపంచమునంతటి స్వాతంత్ర్యలక్ష్మి యాక్రమించుఁ గాక, నా కీబందిఖానయే బృందారకుల నందనవనము కాఁదగు.

పరా:—(తనలో) యోగమాయ తనవలల వేయ సాగించినది. (ఆర్యదాసుతో) బలే! తెలివి యనఁగా నిదోయి? (ప్రతినందునితో) కాలు కదిలింపవేమి? నావెంట రమ్ము. (ఆర్యదాసుతో) విను. నీవు నాకై మఱి కొంతకార్యము చేసిపెట్టవలసె యున్నది.

భార:— (ప్రతినందునితో) చింత చెందకుఁడు. నా తండ్రిగారు వాక్కుతోఁ గొంతపరుషనటనఁ జూపినను, వారి హృదయము హయ్యంగవీనము. ఇంతకుముందు మీరు చూపిన తీక్ష్ణనటన నే నెన్నండు నెఱుఁగ.

పరా:- (ఆర్యదాసుతో) నీకుం బూర్ణస్వాతంత్ర్యమును నేఁడో రేపో యీఁగలను. గంధమాధనమున మదించి విహరించు గంధవహునిమాడ్కి విహరింపఁగలవు లే. కాని, నాయాన తప్పక పనులు బూర్ణముగఁ జేయవలయు.

ఆర్య:- ఒక్క యక్కరమైనం బొరపాటు రాకుండ.

పరా:- (ప్రతినందునితో) కాలు సాగదేమి ?

(భారతితో) ఆతనిం గూర్చి నాతో నీ వొంత మాత్రము హెచ్చరింపవద్దు. (నిష్క్రమింతురు)



# ద్వితీయాంకము.

## ప్రథమరంగము

ఆ ద్వీపములోని మఱియొక భాగము.

[ ఇళాంశుఁడు, శివాస్త్ర్యయనుఁడు, ఆంఫెసనుఁడు, కాంచ్యుఁడు, ఆత్రేయుఁడు, వారణాసికుఁడు మొదలగువారు ప్రవేశింతురు. ]

కాంచ్యు:— సంతోషపు మాటలతోఁ దామసపు దయచేసి కాలము గడుపుదుమా? మన కందరికి నిల్లు ప్రాణము లిట దక్కియుంట మిక్కిలి సంతసింపఁదగిన వార్తయే. మనకు సంభవించిన కష్టా లనేకులకు సంభవించునవియే. ప్రతిదినము నేనాపకుని భార్యయో యే వర్తకపు నావికాధికారియో యేసముద్రప్రయాణికుఁడగు వర్తకుఁడో, ఈ మనపడిన పాట్లును దుఃఖమును బడుచునే యుండు. ఏ పురాకృతపుణ్యఫలమో మన సంకటములకు నడ్డపడి మనలం గడతేర్చినది గాన నిప్పుడు మనచే ననుభూయమానమగు సుఖ మెంతటి యల్పసంఖ్యాకుల భాగధేయమో సముద్రయాయుల దుఃఖానుభవముల వినియున్నవారికిఁ దేటపడఁగలదు. కాఁబట్టి, మన ప్రకృతసుఖమును గడచిన దుఃఖమును సరిపోల్చి, మనమే యిప్పటికిఁ జాల నదృష్టవంతుల మని నమ్ముఁడు.

ఇశాం:— నా మాట విని యీ పురాణమును గట్టుదూ.

శివా:— ఈ శాంచ్యునకు సుఖమనునది చద్దిగంజివలె నూరక దొరకుచుండును. (అపవారితముగ నంధనరునితో)

అంధ:— ఆదరింపవచ్చిన తీర్పుకాండ్రకువలె నతని వదరుఁ బోతుఁ దనమునకు మితి యెక్కడిది.

శివా:—చూడు ! చూడు ! మన శాంచ్య పండితుఁడు తన భాషా మంజరికి సమాప్తి చెప్పఁబోవుచున్నాఁడులే ! ఈతని మనీషాఘటీయంత్రము సంటూరవార్థమై కుంచిక యీఁబడుచున్నది. ఇఁక గంటలు కొట్టఁబోవును.

శాంచ్య:— అయ్యో ! —

శివా:— (లెక్కపెట్టుచు) ఒక్కటి ! లెక్కపెట్టు.

శాంచ్య:— నమ్ముచున్న ప్రతిదుఃఖము మీకు వేళంకోణముగనే తోఁచునెడల, మీబోటి పోకిరీలనొసట మూఁడు గిలుగా వ్రాసియున్నది—

శివా:— నక్కట్లు నవన్నులే

శాంచ్య:— లేదు ! ఇక్కట్టుల వరుసే; నిక్కము. నీవనుకొన్నట్లు నాకున్నను, ప్రాసము పరిహాసాస్పదముగనే కుదిరినదిలే.

శివా:— తమకు సర్వము వేదాంతపు బోధాంతముగనే స్ఫురించుచుండును.

శాంచ్య:— కాఁబట్టి, మా దొరగారూ !

అంధ:— ఛీ ! మా కెట్టివదరుఁబోతు దాపరించెను ?

ఇళాం:- ఇఁక సంవాదమును జాలింతురూ !

కాంచ్యు:- మంచిది. ప్రభూ ! చాలించితిని. కాని,

శివా:- కానియ్యా, అర్ధణాయా ! మొత్తమున విసుగులేక యతఁడు కూయుచునే యుండును.

అంధ:- ఏమోయీ ! పందెము వేయుదువా ? పెద్దరిలో, ఈతఁడా, లేక, ఆత్రేయుఁడా, కూఁతలలో మొదటి మొనగాఁడు.

శివా:- ఈ ముదుసలి పుంజే.

అంధ:- కాదు. ఆకుక్కుట శాబమే.

శివా:- సరే. అయినదా ! పందె మేమి ?

అంధ:- ఒక గ్రుడ్డిగవ్వ. (నవ్వుచు)

శివా:- ఒప్పుకొన్నట్లే ?

ఆత్రే:- ఈ దీవి యొక మొడాదివలె నున్నను,

శివా:- (నవ్వుచు) అహ్హాహ్హా ! (అంధనుసూచి) పందెము చెల్లించితినిగదా !

ఆత్రే:- నివాసాయోగ్యమును, బొత్తుగాఁ బ్రవేశాసాధ్యము.

శివా:- అయినప్పటికి,—

ఆత్రే:- అయినప్పటికి,—

అంధ:- మొదటితరగతి బాలుఁడైనను మఱి యేపద మిప్పట్టున వాడును ?

ఆత్రే:- దీని శీతోష్ణస్థితి మిక్కిలి సౌఖ్యముగ నుండునని తోఁచెడి. ఇక్కడి వాతపోతములు మనోహరసౌరభభరితములై వీచెడి.

కాంచ్యు:- ప్రాణరక్షణ కావశ్యకమైన దంతయు నిక్కడఁ గలదు.

అంధ:- నిజమే ! గుక్కెడు గంజి కక్కఱకు వచ్చునవితప్ప

శివా:- ఆవిషయము పెద్ద సున్నయే.

కాంచ్యు:- ఈ నేలమీఁదగడ్డి యెంత యాకుపచ్చగా నవనవ లాడుచున్నది !

అంధ:- నేల యెండకు నెండి మలమల మాఁడుచున్నదా ? నవనవలాడుచున్నదా ?

శివా:- అక్క డక్కడఁ గొంతవర కాకుపచ్చగానే యున్నది.

కాంచ్యు:- కాని, విశేష మేమన — నమ్ముటకు వీలు కానిదే.

శివా:- లోకములోని వింతలన్నియు, విశేషాలన్నియు నిట్టివే.

కాంచ్యు:- మన దుస్తులు సముద్రములోఁ దడిసియున్నను, ఉప్పునీటి మరకలు లేక క్రొత్త నీరుకావిరంగుపట్టినట్లు నవనవోన్మేషముతో నొప్పుచున్నవి. ఎంత వింత !

అంధ:- ఈతని కీసాలలో నొకటైన మాటాడఁగల్గియున్నచో, ఈతనిమాట లబద్ధములని సాక్ష్యమీదో !

శివా:- ఔను. అట్లు కానిచో, అదియుం గల్లరీనితోఁ జేరి కల్ల లల్లునేమో !

కాంచ్యు:- ఆఫ్రికాలో జరిగిన క్లారిబెట్టాల్యానిరాజుల వివాహ మహోత్సవమునకై మనము మొదట ధరించి నప్పుడీబట్ట లెట్లుండెనో, యిప్పుడును నా బుద్ధికి నంత పరిశుద్ధముగనే చెక్కుచెదరనట్లు కాన్పించుచున్నవి.

శివా:— మంచి శుభకరమైన వివాహములే. మన తిరుగు ప్రయాణములోని మన శుభపరంపర చాటి చెప్పుట లేదా?

ఆత్రే:— ట్యూనిస్సింహాసనముమీఁద నిక్కినసాగసుగత్తె యెప్పుడు నెక్కియుండదు.

కాంచ్యు:— "విధవయగు హైటోరాణిగారి కాలమునందువార్త" ననుము.

అంధ:— విధవా! శుభము పలుకరా మంకెన్న యాండు, పెండ్లివిందునకు వచ్చిన యిల్లాండ్రందరు నా భార్యనే యను సామెతగా నున్నది. దాని తాత్పర్య మెంత. ఈ వివాహపుసంగతిలో నెక్కడిదో విధవారండావివాహ పురాణ మెత్తితి వేల?

శివా:— విధురుఁడగు నైన్యునిపేరుంగూడ నెత్తఁడనుకొంటివా? ప్రభువుగారూ! తమ కెంత కష్టముగఁ దోఁచు చున్నదో?

ఆత్రే:— విధవయగు హైటోరాణింగూర్చియే కదా నీవు ముచ్చటించుచుంటివి. నాచదువుకొను కాలములలో నాపె కార్తాజిపురి రాణియని చదివితినిగాని ట్యూనిస్పుర రాణియని చదివియుండ లేదె!

కాంచ్యు:- ఈ ట్యూనిసే పూర్వకాలపు "కార్తాజపురి".

ఆత్రే:— కార్తాజియా?

కాంచ్యు:- నమ్ము నామాటను; కార్తాజియే.

అంధ:- సృష్టికారిణియగు నా వాణియొక్క వీణామహిమను మించినది యీతని వాఙ్మహిమ సుమీ! పూర్వకాలమునందు నాంఫియ న్వీణ రాళ్ళను గరగించి యిచ్ఛామాత్రముగ థీబిస్పురపుఁగోట గోడలగునట్లు చేసెనఁట.

శివా:-ఇప్పుడీతఁడు తన వాఙ్మహిమచే గడిగోడలను మాత్రమే కాక, లోపల గృహాదికమునుగూడ సృజించుచున్నాఁడు.

అంధ:- అఘట ఘటనాపటీయసి యగు మఱి యేనూతనపు మాయ నింకఁ జేయఁబోవునో.

శివా:- ఈ దీవినిఁ దన జేబులో (కీసాలో) నిముడుచుకొని పోయి తన కొడుకున కొక పండని చెప్పి యిచ్చునేమో!

అంధ:-తరువాత నాపంటులోని గింజలను విత్తి, దీవులపంటయే పండించునేమో!

కాంచ్యు.- తమ యుల్లము మిగులఁ దల్లడిల్లి యున్నది. మన దుస్తులు బొత్తుగా వైఖరిచెడిపోక క్రొత్తవిగానే యొప్పుచున్నవని మా మాటలసందర్భమున నే ననుచుంటిని. తమ కుమార్తెగారి వివాహోత్సవమున నున్నట్లే —

ఇళాం:- నా చిత్త మిత్తఱి యేమేమి దుఃఖములో తల పోయుచు నస్తినాస్తివిచికిత్సాహేతువగుచుండ నీ యనవసరపు వాగుడుతో నా చెవులకుంగూడఁ దెవులేల యంకురింపఁ జేయుదురు? ఈ నా కుమార్తె వివాహ మాదూరదేశమునఁ గాకున్న మన కీసంకట

ములు సంఘటింపకుండునవియే యని నే నెంచెద. నా కొమరుని కబురే లేదుగదా! ఇంతటి దూరదేశమున నిచ్చిన హేతువుచే నా కుమార్తెయుం పతుల్యయే. నవపురీమలినహీనపురీరాజ్యములకు హా! ఈశ్వరా! నే నౌరసహీనునిం, గావలసివచ్చెం గాఁబోలు. ఏ ఘోరతిమింగిలముల నోటఁబడితివో గదా? నా కిఁక దిక్కెవఁడు?

వార:— ప్రభూ! దుఃఖింపకుఁడు! దుఃఖింపకుఁడు! ఆతఁడు సజీవుఁడై యే యుండు.

ఈదుచు స్నిరధిన్ హేయవీచీతతిన్
జోదుతురంగ్యన్వలెన్ సొంపుగాఁ ద్రొక్కుచున్
మీఁదినీరంబుపై మేదినిన్ వెట్టున
ట్లొఁ దగంజూచితిన్ లీల నీపుత్రునిన్ ॥

శ్వసనరోధ జలవిరోధి సాధనై ధమానవి
శ్వసనయోగ్యయుక్తి నెట్టిశాసనన్ నిరాసనన్
లసితపద్మసుమనిభమృదులాచ్ఛమౌ శిరోధిపై
విసుకులేక శిరసునెత్తి వీరుఁ డీదులాడెడున్ ॥

అరిత్ర సన్నిభంబులైన హస్తముల్ ప్రశస్తతన్
ధరిత్రిఁజేరఁ దీరభూమితట్టు వైచి ధీరతన్
చిరత్నరత్న సన్నిధాన శీతవారిపూరమున్
ధరించె నీసుపట్టి నమ్ము దాపుచేర దీవికిన్ ॥

ఇళాం:— నమ్మఁజాల. వానిపైని యాశలు వదిలితిని.

శివా:- ప్రభూ! స్వయంకృతాపరాధమని తామే యోపి కొనియె దుఃఖమును సహింపవలయును. మనయూరపు ఖండకులలో నే ప్రభువునకు నీక తామే చేతులారఁ దమ కుమారిను బహుదూరమందున్న యాత్రికా నివాసికి నిచ్చివేసితిరి. కుమారుని సంగతి యేగతియైనను, ఈకుమార్తె నీకమీఁద మీరు చూడఁగల్గుట మిక్కిలి దుస్తరము. ఇట్లు మీ దుఃఖము ద్విగుణితమగుచున్నది.

ఇళాం:-నా మనస్సును మఱియు మఱియు నేల కలఁతపెట్టెదు. ఈ దుఃఖవార్త నీకేఁ గదిలింపకు.

శివా:- మేమందరము మీకాళ్ళ వ్రేళ్ళంబడి యెంతెంతగనో బ్రతిమాలుకొన్నను, మీరొప్పరైతిరి. రూపవతియు సుశీలయునగు మీ కుమార్తెయు నేమియుం దోఁపక విధేయతానంగీకారము లనువానిమధ్యఁ దన మన స్సుయ్యేలలూఁగ మిక్కిలి వ్యాకులితయయ్యె. మీకుమారుని యాశలు నాకు లేవు. ఎందరు మన పురవాసినులు విధవలైరో, లేక, కానున్నారో యెవరెఱుంగుదురు ? మొత్తాన నిదియంతయుఁ దమస్వయంకృతాపరాధమే.

ఇళాం:- కినుక నేన న్నీదుఃఖము కాల్చివేయుచున్నది.

కాంచ్యు:- శివాస్త్యయన ప్రభువుగారూ! తాము చెప్పునది సత్యమనుకొన్నను, బొత్తుగా మార్దవమను గంధమైన లేనిదై, దేశకాలానుసారి కాక వ్యసనవర్ధక మగుచున్నది. కడుపుమీఁది పుండునకుఁ బట్టి వేయుటకు బదులు తాము కదిలించి కలఁతపెట్టుచున్నారలు.

శివా:— మిక్కిలి బాగుగా సెలవిచ్చితిరి !

అంధ:— నిజమే. ముమ్మాటికి మీ మాటనే మెచ్చుకొందును. శస్త్రవైద్యుఁడు మఱేమి చేయవలయు ?

కాంచ్యు:— ఈ దీవియంతయు నా వలసభూమియైన,

అంధ:— (శివాస్త్యయనునితో) ఈతఁడు సమ స్థాపబీజములను నాటి పంటలు పండించుచుండెడివాఁడు !

శివా:— ఎలుకజెముడు పంట లనరాదా ?

కాంచ్యు:— నేనే దీనికి రాజునై యుండిన, నే నేయే మహాత్కార్యములఁ జేసియుండను ?

శివా:— ఒడ లెఱుంగక తప్పఁద్రాగుచుండెడనేమో ! అందు నకుఁగూడ నిక్కడ నది శూన్యమే.

కాంచ్యు:— ఈ ప్రజాధికృతరాజ్యములో వ్యవహరింతు డ యీ కలియుగాచారములకు విపరీతముగా సాగుచుండెడిదే ! నిష్క్రమూలక సమస్తవర్తక వ్యాపారము సున్న యయ్యెడి. దండాధికారి పేరుకైన లేకుండెడి. ఈ వంకరటింకర చదువులకుఁ బ్రసక్తియే యుండదు. అతి ధనవంతులకు నతిదరిద్రులకును సమానమగుచభావమే. ఒడంబడికలు, ఔరసపు తగవులు, సరిహద్దుపోట్లాటలు మొదలగునవి విననైన రాకుండెడి. లోహములు, ధాన్యాలు, మద్యములు, నూనెలు, ఇతరవృత్తులును సర్వము శూన్యమే. పురుషులకుఁ బనియే యుండదు. స్త్రీలు నట్లే! కాని నిరపాయలును నిప్పువంటి పవిత్ర చరిత్రలు. ఏకపాలకత్వ మనుట యిటఁ గల్లు.

శివా:— రాజపదవి లేదఁట కాని, తానే యచ్చట రాజయి యుండఁగోరును.

అంధ:— ఈయన నూతనసామ్రాజ్యము కొనవర కాలోచించు వరకు మొదలే మరపునకు వచ్చును.

కాంచ్య:— ప్రకృతియందు సమస్తవస్తువులును శ్రమలేకయే, పని యెవ్వరును జేయకయే ఫలించుచుండును. రాజద్రోహము మొదలగు దోషములుగాని, ఖడ్గము, తుపాకి మొదలగు నాయుధములుగాని, ఏవిధమైన యంత్రములుగాని బొత్తుగా నా సామ్రాజ్యమున నుండరాదు. ప్రకృతి స్వభావసిద్ధముగ సమస్తవస్తువులను బుష్కలముగ నా నిరపరాధులగు ప్రజలకై ఫలింపఁ జేయుచుండవలయును.

శివా:— ఈతని ప్రజలలో వివాహసంబంధము లనుమాట కలలోవార్త కాఁబోలు.

అంధ:— ఛీ! లేదోయి. 'కర్మ' అనుమాటయే వినఁబడరాదు.

అంధ:—అందరు సోమరిపోతులై యుండవలయును. ఇఁక వివాహాది ప్రసంగములకుఁ బ్రసక్తి యెక్కడ?

కాంచ్య:— నా పరిపాలనలోని ప్రజల సుఖాదులు కృతయుగ యోగ్యతను మించియుండఁగలవు.

శివా:— చిత్రము! ఏలినవారి ప్రాభవమును సర్వేశ్వరుఁడు రక్షించునుగాక!

అంధ:— కాంచ్యప్రభువుగారగు వీరు దీర్ఘాయుష్మంతుల రగుదురు కావుతః.

కాంచ్యు:- మఱియు, నా యీమాట వినుండి, అయ్యా?

ఇళాం:- చాలు, చాలు; ఇఁకనైన దయచేసి నీ పురాణము కట్టిపెట్టుము! ఇఁక నన్ను ముచ్చటలతోఁ గదలింపకుము.

కాంచ్యు:- ప్రభువరా, ఆసంగతి తెలిసికొని భయభక్తుల తోడనే మెలఁగుచున్నాఁడను. నేనట్లు మాట్లాడుటకుఁ గారణము వీరి వదరుఁబోతుఁదనమునకుఁ దగు సందర్భమును గలిగించుటయే. వీరి స్వభావము, ఏమియు లేకున్నను, ప్రతిస్వల్ప విషయమునకు నికిలించుటయే యని మనమెల్లరము నెఱిఁగియున్న సంగతియే కదా?

అంధ:- మేము చూచి నవ్వినది నిన్నుఁజూచియే. (అత్యంతాభావము రూపముతో నవతరించిన నీవే.)

కాంచ్యు:- ఎవ రీమీ వేళంకోళపు వదరుఁబోతుఁదనములో నెందునకుం బనికిరాఁడో; కావునఁ గానిండు మీపనిని; మీ నవ్వులకు గురి యత్యంతాభావమే కదా!

అంధ:- అమ్మా! మనవాఁడు కూడ ధ్వని సాగింపఁగలఁడు సుమీ!

శివా:- అప్పుడే వ్యర్థము కాకున్నచో, నీ వామాట యనఁ దగు.

కాంచ్యు:- మీరలా! మహాశూరశిఖామణులు కదా! చంద్రబింబమును గూడ, మీ మాటలకు మార్పుఁజెందక యెదవపారమును దిరుగసాగినయెడ, మండలమునుండి యెత్తిపారవైవరో!

{ ఆర్యదాసుఁడు గంభీరగానము చేయుచు
నెవ్వరికిని గానరాకుండఁ బ్రవేశించును. }

శివా:- మే మంతటివారమే, అట్టి చీఁకటిరాత్రులం బిట్టలఁ బట్టఁబోవుదుము.

అంధ:- కాదు, మంచిదొరా, కోపపడకుండి.

కాంచ్య:- నమ్ముఁడి. నాకుఁ గోపములేదు. ఇంత తెల్వి తక్కువగా స్వల్పవిషయములకై నా ప్రసిద్ధశాంత స్వభావమును జెడఁగొట్టుకొని చెడ్డపేరు తెచ్చుకొందు ననుకొంటిరా యేమి? నాకు నిద్రమత్తుగా నున్నది. మీ రెంతగఁ బరిహసించినను నా నిద్రకు భంగము కలుగఁబోదు.

అంధ:- పోయి, నిద్రపొమ్ము. మా నవ్వుమాటల విన్నకొలఁది నీనిద్ర గాఢతరమగును గాఁబోలు.

(ఇళాంశుఁడు, శివాస్త్యయనుఁడు, అంధనరుఁడుం దప్పఁ దక్కినవా రందఱు నిద్రింతురు.)

ఇళాం:-ఏమి యీవింత! అందరికి నప్పుడే గాఢసుషుప్తిపట్టె నెట్లు? వారికివలెనే నాకుంగూడఁ గన్నులు మూత పడి మనశ్శాంతి యబ్బిన నెంతబాగుండు? నాకును నిద్రవచ్చునట్లే సూచితమగుచున్నది.

శివా:- దయచేసి తాము రాఁబోవునిద్రకు భంగము గల్గించు కొనకుఁడు. దుఃఖమును దూరీకరించునది మఱియొకటి యిట్టిది లేదు. నిద్రాదేవి సమీపించిన మాత్రముననే సుఖ మంకురించును.

అంధ:- మే మిరువురము, మీరు నిద్రించుతఱి, జాగ్రత్తతో, నో మాప్రభువరా, మీ శరీరమును గాపాడుచుండఁ గలము.

ఇళాం:- మంచిమాట; మీకుం గృతజ్ఞుఁడను. బాగుగా నిద్ర మబ్బులు క్రమ్ముచున్నయవి.

(ఇళాంశుఁడును నిద్రించును.)

(ఆర్యదాసు నిష్క్రమించును.)

శివా:- వీరి నిద్రమబ్బు, ఆహా, ఎంతయబ్బురపు వింతగల్గించుచున్నది!

అంధ:- అది యీ దేశపు శీతోష్ణస్థితియొక్క నైజగుణము.

శివా: అదే నిజమైనచో, నా కనురెప్ప లేల మూఁతపడవు? నాకు నిద్రపట్టునట్లు కానరాదు.

అంధ:- నాకును నిద్రమత్తేమాత్రమును లేదు. నా సర్వేంద్రియములును మిక్కిలి చురుకుగానే పనిచేయుచున్నవి; (అవియన్నియుం గూడఁబల్కుకొని యేకధోరణినే పనిచేయుచున్నవి.) వారందరు నొక్కటే రీతిన గూడఁబల్కుకొన్నట్లుగ గాఢసుషుప్తిఁ జెందినారు. చూడఁజూడఁ బెద్దపిడుగు పడ్డచో జనులు పడిపోవునట్లే వీరలు కాన్పించుచున్నారు. దిటవైన శివాస్త్యయనుఁడా! ఎంతఘనకార్యము! ఎందునకు లెండు? కాని, నే నెంత నోరుమూసికొనఁ బ్రయత్నించినను, నీమోము కళలోని మార్పు నీకు లభింపఁదగినపదవిని సూచించెడు. నీ కిప్పు చిక్కినసమయమే

నిన్నుఁ బేరునఁబిలచి సన్నిహితలాభము నంద విందు నకు నాహ్వానము చేయుచున్నట్లున్నయది. ఉత్సాహ బలభరితమగు నా మానసము నీ నొసటిపై నలంకరించి పడనున్న కిరీటకాంతులఁ బ్రేక్షించుచున్నట్లగన్పట్టెడి.

శివా:— ఏమిూవింత ! ఈ నీ మాటలు జాగ్రదవస్థవియా ?

అంధ:— నీ చెవులకు వినఁబడుచున్నవా ? లేదా ?

శివా:— వినుచున్నాను ; నిదురలోఁ గలవరించుపలుకులఁ బోలి యున్నవి; గాని, మఱియొకరీతిగ లేవు. నీవు చెప్పిన దేమి? ఈ నీనిద్ర మిక్కిలి విచిత్రముగనున్నది; కన్నుల బాగుగఁ దెరచికొనియే తిన్నఁగ నిద్రించుట యొక్క క్రొత్తవింత. నిలచియుండియు, మాటలాడుచుండియుఁ, గదలుచుండియు, నిద్రమబ్బు మాటలాడుట నా కచ్చె రువు కలిగించుచున్నది.

అంధ:— ఘనుఁడవగు శివాస్వామియనుఁడా, ' సిరిరాఁబోవు తరి మోకాలడ్డపెట్టఁబోవుచున్నావు; నీ కలిమికలికినిఁ జంపుకొనఁ జూచుచున్నావు ' అనుట తప్పుకాదు. నీ స్థూలదేహము మేలుకొనియే యున్నట్లున్నది; కాని, నీవాఙ్మనో నేత్రాదులు చురుకులేనివై, యదృష్టదేవత చేతికి నందించుచున్న యమూల్య ఫలమును గ్రహింప లేకున్నయవి.

శివా:— నీవి కలవరపుమాటలని విస్పష్టముగఁ దేలుచున్నది. కాన నీమోసపు గురకలలో నీసమైన ననుమానము లేనిదోసంపు టర్థము విస్పష్ట మగుచున్నయది.

అంధ:- నేను వేళంకోళముగా నిప్పుడు మాటలాడుట లేదు. నా మాటలు త్రికరణశుద్ధి కలవి. నామీఁద నీకు గౌరవాదులున్నయెడల నీవును త్రికరణశుద్ధిగనే నడచు కొనవలయును. నీవు నేఁజెప్పినట్లు చేసినయెడల, నీ మైశ్వర్యాదులు కోటిరెట్లతిశయించును.

శివా:- నా మనస్సు నిశ్చలోదకమురీతిఁ గదలకున్నయది.

అంధ:- నీ చిత్తనిశ్చలత్వమును బోఁగొట్టి, క్రియాపర్యవసాయినిఁ జేయఁగలను.

శివా:- అట్లే కానిమ్ము. నా నైజగుణమగు సోమరితనము నన్నుఁబాపంగనీదు.

అంధ:- నీ మాటల నెంతగ వేళంకోళము పట్టించినను, నాకుఁ జింతలేదు; వాని యంతరార్థములు నీ వెటింగి పనికిఁ బూనినచో నా పదముల సామాన్యార్థమును దొలఁగించి, నీ వాక్యములే కొంతవర కాయంతరార్థమును వెలిపుచ్చుచు నీవు చేయవలసిన కార్యమున కనుకూల దృష్టినిఁ జూపుచున్నవి. నీవు చెప్పినట్లు సోమరి పోతులు తమ కందఁబోవుఫలములను రవంతలోఁ బోఁగొట్టుకొందురు.

శివా:- దయయుంచి, నీ యుపన్యాసము నాపకుము. నీ చూపులలోని నిశ్చలత్వమును, నీ ముఖము పాలిపోవుటయు నీవు చేయుబోధ యొకఘోర ఘనకార్యమును గురించి యని సూచించుచున్నవి. నీ చెప్పెడి యొప్పుల

పలుకులకు మహాఘన ఫలప్రసవమే పర్యవసానము కావలయు.

అంధ:— అయిన, వినవయ్యా! జ్ఞాపకశక్తి తగ్గిన యీ సభికుండు రాజునకు నతని కుమారుండు సజీవియై యున్నట్లు నమ్మకమును గలిగించినాండని యనవచ్చును. వీని వాండం బూడ్చినమీందు వీని ననుకొనువారును, జ్ఞాపకముంచుకొనువారు నుండంబోరు — కాని, ఈ నిద్రించువారినిద్ర యెట్లుబద్ధము కానేరదో, అట్లే, అతండు మృతినొందకుండుటయు నసంభవమే.

శివా:— అతండు మునింగిపోలేదని నా కెంతమాత్రము నాశలు లేవు.

అంధ:— ఈ విషయమున నీ కాశలు లేకుండుటలో నెంతటి గొప్ప విశిష్టాశ గర్భిత మగుచున్నది! ఈ గర్భితమగు నాశ సమస్తవిధములగు నధికారకాంక్షలను దలదన్నుచు నంతకుం బైన మఱియొకటి కోరందగినది యుండంబోదని చెప్ప నొప్పియున్నది. ఫ్రతినందుండు సముద్రమున మునింగి పోయినాండని పీఠికగా నంగీకరింతమా?

శివా:— వాండు గతించినవాండే.

అంధ:— మంచిది! నవపురికిం దరువాతి యాధారసుండగు హక్కుదారుం డెవండో చెప్పు నాకు.

శివా:— క్లారిబెల్.

అంధ:- ఏమి! ట్యూనిప్రాణియా? మనుష్యజాతియొక్క జీవితాశాంత్యావధినిఁ గూడ దాటి కొంతదూరమున నుండు నాపెయా? నవపురినుండి యుత్తరమునందుట కును బుట్టిన మగశిశువునకు గడ్డము పెరుగుటకుఁ బట్టు నేండ్లకంటె నెక్కువ వత్సరము లెవ్వతెకుఁ బట్టునో యాపెయా?

(అయితే, చంద్రుఁడు మిక్కిలి మందగామి కావునఁ దగఁడు, కాని, సూర్యుఁ డిటువ్వాబంట్రో తైన నొకవేళ నాపైమాటకు వ్యాఘాతము వచ్చు నేమో!)

ఆఁ! కాని, మన మాదరమును దధిలో మునిఁగి పోయియుండ, ఒక రిద్దరము శేషించియుండు టుంచి వినుము. ఈపెకు జాబు వ్రాయు నవపురివాసి యెవ్వఁడు? శేషించుటయు నటుండనేల? ఇట్లు కర్మ గతిచే శేషించుటం బట్టియే మనము ప్రదర్శింపనున్న వ్యాయోగమునకుం బ్రస్తావన ముగించితిమి కాఁబోలు, తక్కిన ప్రయోగము మనవశమై యున్నది కాఁబోలు.

శివా:- నీవి యెంతటి వ్యర్థప్రలాపములు! నా సోదరుని కూఁతురు ట్యూనిసుకు రాణి యన్నమాట నిజమే. అట్లె నవపురికిని నామెయే రాణి కావలెను. ఈ రెండు రాజ్యములకును మధ్యఁ గొంత దూరభార మున్న నేమి?

అంధ:- ఈ గ్లారిబె లెట్లెన్ని యంగుళములు నెత్తిమీదుగాఁ బోయి నవపురిఁ జేరఁగలదనియా దూరమందలి ప్రతి యంగుళమును మొరపెట్టుచున్నట్లున్నయది. ప్రతి యంగుళదూరమును గ్లారిబెల్లు నచ్చుటనే యుండు మనుచు, శివాస్త్యయనుని మేల్కొలుపుమనునట్లు నుద్ఘోషించుచున్నట్లున్నయది. ఈ వీరి గాఢసుషుప్తి మృత్యువుతో సమానముగనే కాన్పించుచున్నది. ఇంతకుఁ బూర్వపు వీరి దారవస్థయుం దత్తుల్యమే. ఈ నిద్రించు రాజువలె నవపురి నేలువా రెంద రుండఁ గూడదు! వారి క్రింద వందిమాగధులవలె వదరు రాజసభాసదు లీకాంచ్యుని మించినవా రెంద రుండఁగూడదు? నా కంకురించిన మనోవికాసమే నీకున్న నెంతబాగుండెడి. ని పురోభివృద్ధికి నీ వీరి గాఢసుషుప్తి యెట్లు మార్గదర్శక స్తంభ మగుచున్నది! ఏమి? ఈ నా మాటలు నీ తల కెక్కినవా?

శివా:- నా కర్థమైనట్లే యెంచుచున్నాఁడను.

అంధ:- నీకుఁ బట్టనున్న యదృష్టము నీ కిష్టసంపూర్తి కలిగించుచున్నదా?

శివా:- నీవు నీ యన్నపదవి నపహరించిన సంగతి నేను మరువలేను.

అంధ:- నిజమే! చూడు. ఈ సామంతరాజచిహ్నాంకితములగు దుస్తులు నాకు ముద్దుగ సరిపోలేదా? నా యన్నగారి

సేవకు లప్పుడు నాతో సమానాధికారు లయ్యె నిప్పుడు నాకు దాసానుదాసులై మెలఁగుటచూడవా?

శివా:— కాని, నీ మనస్సాక్షిని గూర్చి యేమందువు?

అంధ.— అదిగో! చూడవయ్యా! ఆ మనస్సాక్షి యెక్కడఁ గూర్చుండునేమి? ఇది నా హృదయములో నాకుఁ గాన్పింపదు. నా యరకాలఁ గురుపైయున్నను దిరస్కరించి యుపానహాకులం ద్రొక్కఁగలను. ఇట్టి మనస్సాక్షు లప్పుడు లక్ష లున్నను, నా మిలత్రాజ్యాపహరణవిషయమున నన్నడ్డగి చెడివికావు. మృతదేహమువలెఁ బడియున్న నీ సోదరుఁడు, ప్రాణవియోగమైన మీఁద, గాఢసుషుప్తిలో శయనించిన యీ భూమి కంటె నెక్కువవాఁడు కాఁబోఁడుకదా! చెప్పినట్లు విను. నా యీ ఖడ్గంపుమొనతో నీతనిని శమనసదనమున కంపి చిరనిద్రాశమ మనుభవింపఁజేయఁజాలనో? ఈలోఁగా నీ ముదుసలిపిండమును, ఈ మహాబుద్ధావతారుని, మన కృత్యమును దూషించి వెల్లడి చేయకుండునట్లుగ, నీ కుంభకర్ణనిద్రనుండి యెప్పటికిని లేవకుండునట్లు నీచేతి కైదువు చేయఁ జాలదో? ఇఁకఁ దక్కినవారి విషయమో పిల్లి పాలుగతుకునట్లు మన మేగడ్డి సూచించిన నాగడ్డికి సిద్ధపడువారే; మన మేకార్యమునఁ జక్ర మెట్లు త్రిప్పుమన్న నట్లు త్రిప్పువారే!

శివా:— ప్రియమిత్రమా! నీవు చేసిన ఘనకార్యమే నాకు మార్గసూచకము. నీవు మలినహీనపురి రాజ్యము నపహరించినట్లే, నేనును నవపురిప్రాభవము నపహరింప సంసిద్ధుఁడను. కత్తిదూయుము. ఒక దెబ్బతోనే నీవు చెల్లించు సామంతపు సుంకమంతయుఁ దొలఁగింపఁబడినదగు; రాజునగు నేను నీపైఁ బ్రేమవడలఁ బోను.

అంధ:— మన మిరువురము కలిసి యొక్కపెట్టునఁ గత్తుల దూయవలయును సుమీ! నేను నా చేతి నెత్తిన క్షణమే, నీవు నట్లే కాంచ్యునిమీఁదఁ బనిచేయునట్లు కత్తినెత్తి సిద్ధముగ నుండుము.

శివా:— ఓహో! కాని, —— ఒక మాట సుమీ! (రహస్యముగా వీరు మేలొందుచున్న ట్లున్నదని గుసగుస లాడుదురు.)

[ ఆర్యదాసుఁడు కనపడని వాయుదేహమునఁ బ్రవేశించును. ]

ఆర్య:— (కాంచ్యునిఁ జూచి) నా గురువుగారు యోగదృష్టిచే నాప్తుఁడవగు నీ యొక్క ప్రకృతాపాయ స్థితినిఁ గని పెట్టి నీ ప్రాణరక్షణాకై నన్నుఁ బంపినాఁడు.

(ప్రేక్షకులను జూచి) ఈ నిద్రించువారిని రక్షింపనియెడ, నా గురువు చేయ నుద్యుక్తుఁడైయున్న బోధ నెట్లు చేయఁగలఁడు?

( కాంచ్యుని చెవిలో )

ఇచట నీవు గురక లిడుచు నిద్ర సేయుచునుండఁగా
నుచితమంచు మనుజహత్య యొప్ప మేలు కాంచదే !
అసువులం జులకఁగఁ గావ నాస నీకు నున్నచో
వెస మహాసుషుప్తి నింక విడచి లెమ్ము ! మేలుకో॥

( అని పాడును. )

అంధ:— అట్లైన మనము వేగిరింపవలయు.

కాంచ్యు:— (లేచి కన్నులు తుడుచుకొనుచు) ఇఁక దయామయులగు నవ్యయకాయు లీ రాజును రక్షింతురుగాక ! (అంధనర శివా స్త్ర్యయనుల వంకకుఁ దిరిగి) ఏల ? ఏమిది ? (ఇళాంశునిఁ దట్టి) ఓహో ! లెండు! లెండు ! (తిరిగి యంధనర శివా స్త్ర్యయనుల వంకకుఁ దిరిగి) కత్తులను దూసియెత్తి యిట్లు వికారరూపులై కాన్పించుచున్నార లేమి ?

ఇళాం:— (నిద్ర లేచి) ఏమిసంగతి ? ఇది యేమి ?

శివా:— మీకు నిద్రాభంగము కాకుండునట్లు మేము కాపు దారిచేయుచు నిట నుండఁగా, ఇప్పుడిపుడే, అడవి యెద్దుల రంకెవలె, సింహగర్జనమువలె వినవచ్చెను, ఒక యరపు వినవచ్చెను. మిమ్ముల నదియే మేల్కొలిపెనుగా ! నా చెవినఁ బడుటతోడనే నాకు భయమును గలిగించెను.

ఇళాం:— నే నేమియు వినలేదే ?

అంధ:— ఆ మహాశావము ఒక్కోపీరుల శ్రావణప్రత్యక్షమైనను భయావహాము కాకమానదు. అదియొక భూకంపము వలె నుండెను. నిశ్చయముగా నది సింగంపుసంఘము యొక్క గర్జనములకుం దర్జన మనఁ దగు.

ఇళాం:— నీవును దీనిని వింటివా? కాంచ్యూఁడా!

కాంచ్యు:— నాతోడయ్యా! నే నొక హమ్మను శబ్దమును మాత్రము విన్నట్లు తోఁచుచున్నయది. అదియు విచిత్రరీతిగ నన్ను మేల్కొల్పినది. మిమ్ముఁ దట్టి లేపి, అరచితిని. నా కన్నులు తెరచి చూడఁగానే వీ రుభయులు కత్తులు దూసి యుండిరి: అదె! ఆ శబ్దమై యుండు. మన మిఁక జాగరూకులమై యుండఁదగును. మఱియు నిచటనుండి యాయుధసన్నద్ధులమై మఱి యొచటకైనం బోవుదము.

ఇళాం:— మఱియొక చోటునకుఁ ద్రోవఁదీయుము. నా దుర దృష్టుఁడగు కొమరునికై మఱి కొంతదూరము వెదకుదము గాక!

కాంచ్యు:— ఈశ్వరుఁ డాతని నీ మృగబాధనుండి రక్షించుఁ గాక! తప్పక యాతఁ డీదీవియందే కలఁడు.

ఇళాం:— పద! పద. (అందరితో నిష్క్రమించును.)

ఆర్య:— నా ప్రభు వగు పరాత్పరుఁ డీనాచేసిన దంతయు నెఱుంగుఁ గాక!

పొమ్ము, రాజా, నీ సుకుమార కుమారుని నిర పాయముగ వెదకికొమ్ము.

## రెండవ రంగము

—: ఆ దీవిలోని మఱియొక చోటు :—

(కాళీవనుఁడు కట్టెలమోపుతోఁ బ్రవేశించును.
ఉఱుము వినఁబడును.)

కాళీ:— ఇనుఁడు తన కిరణములంతో సమస్తరోగకారకములగు స్థలములనుండియు దుర్జలములనుండియు నాకర్షించిన సకలరోగాంకూరములను నన్ను బాధించుచున్న యీ పరాత్పరుని పైనవైచి వాని శరీరమంతయు రోగకుటీరముగఁ జేయుఁగాక! అతని వశమందుండు సమస్త భూతపిశాచాదిగణములును నా మాటల నాలకించుచునే యుండునని నాకుఁ దెలియకపోలేదు. కాని, అతని శపింపనియెడ నా కసితీరదు. అతని యాజ్ఞచేతనే కదా నన్నిట్లు, కాన్పింపకయే గిల్లుచు, పిశాచములవలెఁ గాన్పించి భయపెట్టుచు, బురదలలోఁ దిగఁబడునట్లు చేయుచు, కొఱవిదయ్యములవలె నన్నుఁ ద్రోవఁ దప్పునట్లుచేయుచు, అతని భూతగణములు బాధపెట్టుట! ఏమాత్రము నావల్లఁ దప్పున్నను, ఈ భూతగణముల నతఁడు నాపై నుసికొల్పును. అంతటఁ గొన్ని భూతములు కోతులవలె నన్ను వెక్కిరించి కరవవచ్చుచుండును; కొన్ని యడవిముండ్లపందులవలె నాకడ్డమై నా పాదములకు ముండ్లుగుచ్చుకొనునట్లు నిక్కి నిల్చుచుండును; కొన్ని చీలియున్న

నాలుకలుకల చిలువలవలె నా యొడలికిం దగులుకొని చుట్టుకొని బుసలుకొట్టుచు నట్టిట్టు కదలనీక నాకు పిచ్చి యెత్తించుచుందును. ఇదిగో! చూడు! చూడు! నే నికట్టెలమోపును దెచ్చుటలోఁ గొంచె మాలస్య మైనదని నన్ను బాధపెట్టుటకై యీ భూతమును దరి మినాఁడు. నేను జచ్చినవానివలె బోర్లఁబడియుందును; నన్నువాఁడు నో చూచెదఁగాక!

(త్రించలుఁడు ప్రవేశించును.)

త్రించ:— ఈ గాలివానబాధనుండి కొంచెమైన నోడలు కాపాడుకొందమన్న నిక్కడఁ జెట్టును గానరాదు. చెట్టుపొదయును లేదు. ఇంకొక గాలిజల్లు వచ్చుచున్నది; అదిగో! ఆ గాలిచప్పుడు దానిదే! అదిగో, ఆ నల్లనిమబ్బు, ఆ యమోఘమగు మేఘము కార్చుచున్న కల్లుకుండవలెఁ గాన్పించుచున్నది. ఇదివరకు వలెనే యురుములు మెఱుఁగులును వచ్చినయెడ నేనేడ నా తలఁ దాఁచుకొనువాఁడ? తోఁపకున్నయది. ఆ ఘనాఘనము ఘనముగఁ గడవలతోఁ గుమ్మరింపక పోఁజాలదు. కాని, ఇదేమి వింతరూపు? ఇది మనుష్య రూపమా? మత్స్యాకారమా? చచ్చినదా? బ్రతికి యున్నదా? ఇది యొక చేఁపయే కాఁదగు; చేఁపకంపే కొట్టుచున్నది; మిక్కిలి పురాతనమైన చేఁపకంపువంటి కంపే! ఎండిన యీకాలపుటుప్పుచేఁపకంపు కాదు. ఇది యొక విచిత్రమత్స్యము! నేనిప్పు డాంగ్లభూమి

నుండి దీని చిత్రపటము బైట వ్రాసి సంతలం జూపుచు
నేని, తిరుగఁబోతులు షిల్లింగులఁ జెల్లించి చూచి
పోరా? ఇట్టిచాని నట్టిదేశమందలి సంతలఁజూపి మహా
ధనికులము కావచ్చును. ఒక కుంటిబిచ్చగానికిని గ్రుడ్డి
గవ్వనైన నీఁజాలరుకాని, ఒక ఇండియన్ శవమును
జూపినను, ఎన్నిపెన్నీలైన వేయుదురు. మనుజజాతివారి
కాళ్ళవలెనే దీనికిని గలవు; దీని వాలుసులే చేతుల
వలె నున్నవి. ఏమి! వింత! శరీరము వెచ్చగనున్నదే!
అట్టియూహలఁ గట్టిపెట్టి, ఇది మత్స్యము కాదనియు,
ఇఁక నా సందేహముల మాని, ఇది యీద్వీపవాసి
యొక్క దేహమనియు, పిడుగు పైనఁబడుటచేత నిట్టి
తేఁడు క్రిందఁబడి యున్నాఁడనియు నిశ్చయింపఁగలను.
(ఉఱుముఱుమును) అయ్యో! తిరిగి గాలివాన వచ్చు
చున్నది; ఈ ద్వీపవాసియొక్క యంగరక్షాలో దూరి
యుందునుగాక! ఇఁక దాగియుండ వేరొకయుండ
యిక్కడ నుండఁబోదు. కష్టములు వచ్చినప్పు డెట్టి
విదేశీయ దుష్టులయండనైనఁ జేరవలసి వచ్చునుగదా?
ఈ గాలివాన పోవువరకు నే నీముసుకులోనే యుం
డెద. (కాలీవనుని యంగరక్షాలో దూరును.)

(ష్ట్రీవనుఁడు సారాబుడ్డి చేతిలోనుంచుకొని పాడుచుఁ
ప్రవేశించును.)

ష్ట్రీవ:— ఇఁక నోడప్రయాణము చేయఁగదా!
ఇఁక నీపుడమిన్ దుదఁ గందుఁగదా!

చచ్చుటకు సిద్ధముగ నున్నవారియెదుట నీ నీచపు రాగమా? ఛీ! తగదు; కానిమ్ము ఇదియే నా యానంద కందము. (అని త్రాగును)

స్త్రీవసుని పాట.

బోటు కళాసీ రండరు నేనున్
గాటుక కండ్లన్ గాముని తూపుల్
నీటుగఁ గుల్కన్ నిగనిగ మనుచున్
బాటలగంధుల పాటల వినమో ॥
కేటినిమాత్రము క్రేఁగంటినమే
మేటికిఁ జూతుమహితగతి మమ్మున్
బోటులఁ దారుల భోగిపువాసన
బోటి సహింపము; పోనీ, దర్జీ
సేటుల మెచ్చెడి; ఛీ! ఛీ! యొల్లన్.
నీటి పయనములె నెమ్మది మనకున్
జేటులు మెచ్చినఁ జీ! చీ! యన్నన్ ॥

ఈ రాగముకూడ బాగుండలేదు. పోనీ, నాకీ సుఖకందమందు నంతవరకు దుఃఖ మెక్కడిది?

(అని తిరిగి త్రాగును.)

కాం:— నన్ను బాధింపవద్దు సుమీ!
స్త్రీ.వ:— ఇదేమి సమాచారము? ఇక్కడ దయ్యాలున్నవా? ఏమి? మీ కామరూపములతో మమ్ము బెదరింపఁ దలంచితిరా? ఏమి? మున్నీట మునింగియుఁ దిరిగి

తేలి యీఁది బ్రతికివచ్చిన నాకు నీ నాల్గుకాళ్ళను బెదురు కలిగించు ననుకొంటివా? చనప్పొత్తుశున్నను జూచి, యే ద్వీపాత్పురుషుఁడు వెరచును. నా ముక్కు కొనను గొనయూపిరి మెసలువరకు నాకు భయమను నది కలదనుకొంటివా?

కాళీ:— ఈ దయ్యము నన్ను బాధించుచున్నయది. ఓహో!

స్టీవ:— చలిజ్వరముతో బాధపడుచున్న యీ ద్వీపవాసియగు భీకరమృగ మిది? ఇట్టిదానికి మన భాష యెట్లు వచ్చెనో! ఈ రక్కసికి మన బాస నేర్చినందులకుఁగా నుపకారముఁ జేసెదఁగాక! వీనిని బ్రతికించి, మచ్చిక చేసికొని, నవపురికిఁ దీసికొనిపోఁ గలిగితినేని, ఎంత గొప్పమహాప్రభువునకుఁ గూడఁ దగిన బహుమతి కాఁగలఁడు.

కాళీ:— నీ కాళ్ళకు మ్రొక్కెదను; గాని, నన్ను బాధింపకుము. కట్టెలమోపును వేగమే మోయుదునులే!

స్టీవ:— ఈతఁడు తనయెడ తెలియఁగక యేమేమియో వదరుచున్నాఁడు. నాయొద్దనున్న సారాయిని గొంత యితనికిఁ బోయుదును గాక! వీఁ డిదివర కెన్నఁడును సారాయిరుచి యెఱుఁగని యెడల నిది మందువలెఁ బని చేయఁగలదు. వీని రోగమును గుదిరించి మచ్చికచేసి కొంటినేని, వీని నమ్మినప్పుడు కొనువానివద్దనుండి యీ వ్యయమంతయు రెట్టించి కైకొనవచ్చును.

కాళి:— ఇప్పటికి నీ వంతగ నన్ను బాధింపవైతివి; కాని, నీ కూలుడు చూడ నీకు దయ్యము తప్పక పట్టిన దనియు, పరాత్పరుఁడే నిన్నంపెననియు స్పష్ట మగు చున్నది.

శ్రీవ:— రా, రా; నోరు తెరవుము. ఓరిపిల్లీ, నీ విది త్రాగితే నీకు మాటంబుచ్చునురా. నోరు తెరవుము. ఇది నీ చలజ్వరము వదలఁగొట్టును. భయపడకు రా. నీకు శత్రువునుగాను, మిత్రమునే. ఏదీ, తిరిగి దవుడలు తెరవుము. (అని సారాయి నోటిలోఁ బోయును.)

త్రింక:—ఈ కంఠస్వరము నేను విన్నదానివలెనె యున్నది! అది శ్రీవనునివాక్కే. కాని యతఁడు మునిఁగి చచ్చి యుండలేదా? లేక ఇది దయ్యమైనరూపా? ఇట నాగతి యేమగునోకదా?

శ్రీవ:— నాలుగుకాళ్ళును, రెండు కంఠస్వరములునా? ఏమి! వింత రక్కసి! ఈ కంఠస్వరము తన స్నేహితునియెడ దయను జూపుచున్నయది. దీని పూర్వకంఠస్వరము వింత కూఁతలతో మఱింతవింత గల్గించుచున్నయది. ఈ సారాయి యంతయుఁబోసినను, పోనిమ్ము, వీఁడు రోగరహితుఁడైనం జాలును. పట్టు, మఱికొంచెము. (అని మఱికొంత పోయును) తథాస్తని నీ రెండవ నోటిలోఁగూడఁ గొంత పోయుదును లే, చాలు. చాలు.

త్రింక:— శ్రీవనుఁడా!

స్త్రీవ:— నీ రెండవకంఠము నన్ను నా పేరటఁ బిలుచుచున్నదా యేమి? ఇదేమి వింత దయ్యముఠా! ఇది రక్కసి కాదు; దయ్యమే. ఇక్కడినుండి కాలికి బుద్ధి చెప్ప వలయు. నేను దయ్యమునుగాను.

త్రింౘ. స్త్రీవనుఁడా? నీవు నిజముగ స్త్రీవనుఁడవే యైతి వేని, నన్నుఁదాకి నాతో బాగుగ మాటలాడుము. నేను నిజముగ నీమిత్రవను.త్రింౘలుఁడను.భయపడకుము.

స్త్రీవ:— నీవు నిజముగఁ దృ్రింౘలుఁడవేని, బయటికిఁ గదలిరా! ఈ రెండు చిన్నకాళ్ళనుబట్టి గుంజుదునా? (అని గుంజును.) ఇవి నిజముగాఁ ద్రింౘలుని కాళ్ళే! అరె! నీవు నిజముగాఁ ద్రింౘలుఁడవే? నీ విక్కడ కెట్లు వచ్చితివి?

త్రింౘ:—వీఁడు పిడుగు మీఁదఁబడఁగాఁ జచ్చినశవ మనుకొం టిని. సరె, గాని, స్త్రీవనా! నీవు మునిఁగిపోయి యుండ లేదా? నీవు బ్రతికి యుండియే యిట్లు గాన్పించితి వని యిప్పుడు నమ్మిక కలుగుచున్నది. గాలివాన వెలి సినదా? ఈ గాలివానకు వెఱచియే యీ వింతల మృగతుల్యుని ముసుకులో దూరితిని. స్త్రీవనా! నీ వెట్లు బ్రతికివచ్చితివో కదా! నవపురివాసులలో మన మిరువురమైన బ్రతుకఁగలిగితిమి గదా యని సంత సింపవచ్చును.

స్త్రీవ:- నీవు మిగుల మంచివాఁడవు, నన్నూరక కదిలింపకుము. నా మనస్సు పరిపరివిధములఁ జంచలమగుచున్నది.

కాం:- (తనలో) వీరిద్దరును దయ్యాలుకానియెడ, మిక్కిలి మంచివారలే యని యనుకొనవచ్చును. అతఁడు మంచి యమృతకలశమును వహించిన యమరతుల్యుఁడనవచ్చును. ఆతని కాళ్ళమీఁదఁబడి చూతునా?

స్త్రీవ:- నీ వెట్లు ప్రాణముల దక్కించుకొని వచ్చితివోయి! ఇక్కడికే యెట్లుచేరఁగలిగితివి? ఈ సారాబుడ్డితోడు, నిజము చెప్పు. నేనదే యొట్టుపెట్టుకొని నిజము చెప్పుదును, విను. ఒక చక్కరసారాయిపీపాను మన పడవ కళాసీలు మున్నీట వైచిరి. నేను దాని యాధారమున బ్రతికితిని. అంతటఁ దీరమును జేరి యొక్క చెట్టుపై బెరడుతో నీ సీసాను జేసితిని.

కాం:- ఆ సారాబుడ్డితోడు! నేను నీకు నమ్మకము గల సేవకుఁడనై యుండఁగోరెదను. ఆ సారాయి యీ లోకపుదికాదు.

స్త్రీవ:- నీ వెట్లు ప్రాణమును దక్కించుకొంటివో నిజముగా నొట్టుపెట్టుకొని చెప్పు ——

త్రించ:- నీటిబాతువలె నే నీది యొడ్డు చేరితి నోయి! నా యీఁత నేమనుకొంటివి? ఒట్టుసుమీ! బా తీదినట్లే.

స్త్రీవ:- ఈ యమృతకలశమును వేదగ్రంథమును ముట్టి ప్రమాణము చేయుము. నీ యీఁతకు నీవు బాతును బోలి

యుండఁ గలవు; కాని రూపమునకు నాఁడుపొట్టి బాతువలె నున్నావు.

త్రైంచ:- నీవద్ద శేషించిన మద్య మెంతయే ?

ష్టీవ:- కాదు. పెద్ద పీపానిండఁ గలదోయి ! నా సారాయి కొట్టిడి సముద్రతీరమందలి యొక్క గుహాలో; అచ్చట దాఁచి యుంచినాఁడను. (కాళీవనునితో) నీ రోగ మెట్లున్నది ?

కాళీ:- నీవు స్వర్గమునుండి కాదా యిప్పుడు వచ్చినది ?

ష్టీవ:- ఆ యమృతకరుని లోకమునుండి యూడిపడితిని. నా మాట నమ్ముము. పూర్వ మొకప్పుడు నేనే యా చంద్రమండల వాసినై యుంటిని.

కాళీ:- నేను నిన్నామండలమున నిదివరకే కనిపెట్టినాను. నేను నిన్నుఁ బూజింతును. నిన్ను నీకుక్కను నిపొదను నా యజమానుని కూఁతురు చూపించినది.

ష్టీవ:- రా. ఏదీ, ఒట్టు పెట్టుకొనుము. దీనిని ముద్దుపెట్టుకో (అని సారాబుడ్డి చూపును.) నే నీనూతనగ్రంథమున కొక నూతన విషయసూచికఁ గూర్ప నున్నాఁడను. ఏదీ ! నీ ప్రమాణము ?

త్రైంచ:- ఈ యుత్తమప్రకాశముతోడు. వీఁడొక వ్యర్థుఁడైన రాకసుఁడు. నాకు వీనింజూచిన భయ మెట్లుకలుగును ? వీఁడు మిక్కిలి దుర్బలుఁడగు కర్బురుఁడు !

వెఱ్ఱివాఁడు ! ఏదిచెప్పినను, అదియే నమ్మును. షబాష్
గక్కసీ ! పెద్దగుర్కాఁడు పీల్చితివి పో.

కాఁ:— నేను నీ కీద్వీపములోనున్న ప్రతిఫలవంతమగు మూలలను
జూపింతును. నేను నీకాళ్ళకు మ్రొక్కెదను. నీకు
బానిసనగుదును. నీవు నాకు దైవతమవు.

(అని మత్తెక్కి బుద్ధి దాంగిలింపఁబోవును.)

త్రించ:— ఈ కళతోఁడు ! వీఁడొక త్రాగుఁబోతు రాకాసి;
గజదొంగ. తన దైవతమునకు నిద్రపట్టెనా, బుద్ధి
నాషాశభూతివ్వలె దొంగిలింపఁగలఁడు.

కాఁ:— నీ పాదముల ముద్దుపెట్టుకొందును; నీకు బానిసనయి
తిని, ఒట్టు.

స్టీవ:— మంచిది. సరే. రా. మ్రొక్కి ప్రమాణముచేయి.

త్రించ:— ఈ బుద్ధిలేని రక్కసినిఁజూడఁగాఁ బట్టరాని నవ్వు
వచ్చుచున్నది. మిక్కిలి నీచపుజాతి రాకాసి. రెండు
చెంపదెబ్బలు వేతునా ?

స్టీవ:— రా. మ్రొక్కు.

త్రించ:—ఛీ ! వద్దు, వీఁడు త్రాగి యొడలెఱుఁగకయున్నాఁడు
వీనిస్థితి మిక్కిలి హేయము.

కాఁ:— నీ కిక్కడి యుత్తమోత్తమమైన యూటలం జూపుదును;
నీకు మంచి మంచి కాయలఁ గోసి యిత్తును; నీకు
మంచిచేఁపలను బట్టియిత్తును; నీకుఁ గావలసినంతవంట
చెరకుఁ దెచ్చియిత్తును. నావలనఁ బనిని బలాత్కార
ముగఁ గొనుచున్న పరాత్పరుని బొబ్బలమారి మ్రింగి

పోను! ఇఁక వానిపని చేయను; కట్టెలమోపులు మోయను. మీ వెంటనే యిఁకమీఁద వత్తును.

త్రైంచ:—నీనిరూపమె నవ్వుపుట్టించు రాకాసి యాకారము. పైఁగా, తప్పత్రాగియున్నాఁడు.

కాళీ:— ఆ సారాబుడ్డితోడు! నీకు నమ్మకముతోఁ గొలువు చేయుదును, ఏలన, నీవుపోసిన సారాయి దేవలోకపుది.

స్టీవ:— ఇదిగో, అయితే, నీవెట్లు తప్పించుకొని వచ్చితివో ప్రమాణపూర్వకముగఁ జెప్పు.

త్రైంచ:—నీటిబాతువలె నీదుకొనుచు వచ్చి గట్టుచేరితినోయి. నాకు నీఁత రాదనుకొంటివా! ఒట్టు! ఈఁత బాగుగ వచ్చును.

స్టీవ:— ఇదిగో! మన సత్యవేదము. (అని మఱికొంతసారా పోయును.) ఈఁతలో బాతువేమోకాని, రూపమున కుం దెలివికి దున్నపోతువు.

త్రైంచ:—ఓరోరి! స్టీవనా! ఇంకఁ గొంచెముసారాయి నీవద్ద నున్నదా?

స్టీవ:— పీపా నిండఁగలదోయి! సముద్రతీరముననున్న యొక కొండబెలములో నా సారాయిని దాచితినోయి. ఏమోయి! విచిత్రుఁడా! నీ జ్వరబాధ యిపుడు తగ్గినదా?

కాళీ:— నీవు స్వర్గమునుండి యూడిపడితివి! కాదా?

స్టీవ:— నే నాచంద్రమండలమునుండి దిగినానురా; నమ్ము. పూర్వమా చందమామలోఁగాపురమున్న వాఁడను నేనే.

కాళీ:- ఆఁ; అవును. అవును. నిన్నామండలములోఁ గని పెట్టినాను. మా యజమానుని కూఁతురుకూడ, నిన్ను నీ కుక్కను, నీ వుండెడి పొదరింటినిఁ జూపించినది.

స్టీవ:- రా! దీనినిఁ ద్రాగి ప్రమాణము చేయి. ఈ సత్య వేదమునకు నూతన వ్యాసములం గూడఁ గల్పింతునులే!

(అని కాళీవనునిఁ ద్రాగించును.)

త్రించ:- ఈ స్వప్రకాశసారములోఁడు! వీఁడొక పిరికి రాకాసియే. నేనేమి! వీనికి వెరచుట యేమి? వీఁడతి దుర్బలుఁడును, చెప్పిన దంతయు నమ్మువాఁడును. వహావా! నిజముగాఁ ద్రాగుటలో దిట్టమైన చేయి వే.

కాళీ:- నీ కీద్వీపములోని ఫలవంతమగు ప్రతిమూలను జూపెదను. నీ కాళ్ళకు మ్రొక్కెదను. నీవే నా దేవతవు.

త్రించ:- ఈ కళానిధానములోఁడు; వీఁడు తప్పఁదాగి వసరుటలో మేటియే. కాని వీని దొంగకూతల నెవరు నమ్మెదరు. వీని దైవతమునకుఁ గన్నుమరగితే, ఈ సీసాను దస్కరించి పోనుంకించుచున్నాఁడు.

కాళీ:- నీ కాళ్ళు మ్రొక్కెదను. నీ బానిస నగుదును.

స్టీవ:- రా రా! మ్రొక్కు. బట్టుపెట్టుకో.

త్రించ:- వీని చర్యలకుం గూతలకుఁ బట్టరాకుండ నవ్వు వచ్చుచున్నది. రెండు చెంపదెబ్బలు పెట్టుదునా అని తోఁచుచున్నది.

స్టీవ:- రా! రా! కానీ.

(అని మఱికొంత సారాయి పోయును.)

త్ర్యించ:— కాని, త్రాగి యెడ లెఱుఁగక యున్నాఁడు. చెడ్డ త్రాగుఁబోతు రక్కసి.

కాళీ:— ఇక్కడి యుత్తమోత్తమములగు నీటిబుగ్గలను నీకుఁ జూపింతును; మంచి కాయలు కోసిపెట్టుదును; నీకై మంచి చేఁపలఁ బట్టియిత్తును; కావలసినంత వంట చెరకుఁ దెచ్చిపెట్టుదు. ఇప్పటి నా యజమానుని నానారోగాలుం బీకుకొని మ్రింగిపోను! ఇఁక వాని నౌకరి చేయను. నీ వెంబడియే వత్తును.

త్ర్యించ:— ఈ రాకాసినిఁ జూడఁజూడఁ బొట్టలుబ్బ నవ్వువచ్చు చున్నది. వీని త్రాగుడు వింతగా నున్నది.

కాళీ:— నా దొరగా! ఎండ్రకాయలు దొరకుచోటునకు నిన్ను గొనిపోవుదునా? నా బల్లెములవంటి పొడవైన గోళ్ళతో నీకు దుంపలు కుళ్ళగించి యిచ్చెదను. నీకుఁ బిట్టల గూళ్ళను జూపుదునా? కోఁతిపిల్లల మెలకువతోఁ బట్ట నేర్పుదునా? నీకుఁ గావలసినన్ని పిట్టలఁ గొట్టి తెచ్చి యిత్తును. నాతోఁగూడ వత్తువా!

ష్టీవ:— ఇఁక మాటలఁ గట్టిపెట్టి దయచేసి త్రోవఁజూపుదూ! త్ర్యించలుఁడా! రాజు మొదలగు నితరు లందరు మన ముఠాలోనివారు చచ్చియుందురు కావున, దీనికి మనమే యారసులము. ఈ సీసా తీసికో. త్ర్యించలుఁడా! వీనికి మఱికొంత సారాయి పోసెదనుకాక!

కాళీ:— (త్రాగి తెలియక పాడుచుండును) నాకు సెలవా? దొరగారు, నాకు సెలవా?

త్రిశంచ:— ఎట్లు త్రాగి యరచుచున్నాఁడోయి నీవు.

కాఫీ:— చేఁపలఁ బట్టను నే యిఁక మీఁదై

ఓపిఁకఁ గట్టెల నోపికఁ గొట్టఁ

ఏ పనిఁ జేయను బో పో యందును.

ఈ పూఁటయ కొలు విపుడే క్రొత్తగ

దాపరించె నిఁక పో పొమ్మందును.

క-క్క--క్కా--కీవ-వ్వను-వనుచుఁ

జక్కని మక్కువ చాకిరి వోరికెను.

తక్కువలే దిఁక తెక్కల జక్కఁగ

నొక్కట జాడింతును స్వేచ్ఛాగతి.

షీవ:— ఘనుఁడవోయి, రాకాసి; త్రోవఁ జూపుము.

( అందఱు నిష్క్రమింతురు. )



# తృతీయాంకము.

## ప్రథమ రంగము.

(పరాత్పరుని గుహాయెదుట ప్రతినందుఁ డొక మొద్దును మోయుచుఁ బ్రవేశించును.)

ప్రతి:— కొన్ని యాటపాటలు కష్టమిశ్రితములే; కాని వాని పర్యవసానమునఁ గలుగు నానందము దానిని మరపించును. కొన్నియెడల నెంత నీచసేవయు మిక్కిలి గౌరవబుద్ధితోనే చేయఁబడుచుండును. పెక్కు బీద పనులే యెక్కువ ధనము నొసఁగు గను లగును. ఈ నీచసేవ నాకెంతయో దుర్భరమై హేయమై యుండెడిదే కాని నే సేవచేయు యజమానురాలు నిర్జీవమును గూడ సజీవముగఁ జేయఁగలదు; కావున నా యీ శ్రమ యంతయు సంతోషముగానే పరిణమించుచున్నది. ఈమె తండ్రి యెంత కుటిలుఁడై క్రూరుఁడై యున్నాఁడో, ఈమె యంత సౌజన్యభూషితయై యున్నది. ఈ వేలకొలఁది కట్టెమొద్దు లన్నియుఁ బేర్చి పెట్టవలెను; లేకున్న, అతఁడు కఠినముగా శిక్షింపఁగలఁడు. నాయీ శ్రమను జూచి నా యధికారిణి మిగుల దుఃఖించుచున్నది; మఱియు నావంటి యభిజాతుఁ డిట్టి నీచపుఁబని కెప్పుడును నియమింపఁబడి యుండఁడను. ఈ తలంపుల మధ్య నాపని కభ్యంతరము

కల్పించుకొనుచున్నాను. నిజమే! కాని, యీ మనోహరమైన యూహలే నా పనిలోని కష్టమును దొలంగించుచున్నవి. ఏమి వింతయో కాని, యిట్టి యూహలు నా హృదయము నెంత యావహించి యున్నను, కొంచెము పనిమాని విరామముతో నున్నప్పుడే బుద్ధి కేమియుం దీరుబడి యుండదు; పని మీఁదనున్నప్పుడే బుద్ధికిం గొంచెము విరతియుండును.

(మిహిరాండభారతి ప్రవేశించును.)

[పరాత్పరుఁడు దూరానఁ గన్పడకుండ వినుచుండును.]

మి. భా:— అయ్యో! ఇదిగో! నా మనవి వినుఁడు. అంతగాఁ గష్టింపకుఁడు. ఈ పాడుకట్టె మొద్దులమీఁదఁ బిడుగులు పడి కాల్చివేయ! నామనవి విని యీ మొద్దును గ్రింద నుంచుఁడు; కొంచెము విశ్రమింపుఁడు; ఈవంటచెఱకు కాలునప్పుడు నీకుఁ గలిగించిన శ్రమాతిశయమునకుఁ దప్పక యేడ్చును. నా తండ్రిగారు గ్రంథాగారమునఁ దదేకదృష్టితో నేదియో చదువుచున్నారు లెండు. నామనవి యాకర్ణించి యిప్పుడు కొంచె మలసట తీర్చి కొనుఁడు. ఈ మూఁడుగంటలసేపు నా తండ్రిగా రిచటికి రారు లెండు.

ప్రతి:— ఓప్రియతమా! నేఁ జేయవలసియున్నకూలిపని పూర్తి కాకముందే సూర్యుఁడస్తగిరియం దుండునని వెఱచుచున్నవాఁడను.

మి. భా:— మీరు క్రింద విశ్రమించునెడ నేను మీపని కొంత వరకుఁ జేసిపెట్టుదు. మనవి! నా కామెయొప్ప నిమ్ము; దానిం బేర్చెడిచోటఁ జేర్చెద.

ప్రతి.— వలదు; వలదు. ఓ నాధనమా! నేనిచ్చట ముచ్చటగఁ గూరుచుండి నీచే నిట్టి నీచపుఁబని చేయింప నోర్తునా? నా నాళ్లు నరాలు వెన్నుఁబాము విరుచుకొన నొప్పుకొందును, గాని, నీచేతఁ బనిచేయు చుండ నొప్పుకొనను.

మి. భా:— మీ కీపని తగుట యెట్లు? నాకుఁ దగకుండుట యెట్లు? నా మనస్సునకుఁ జేయుటయే యభీష్టముగ నున్నది గాన భారముగఁ దోఁచుచున్న మీకంటె నాకు సులభతరము.

పరా:— (ఆత్మగతము) అయ్యో! బిడ్డా! నీయుల్లము కలుషితమైనది! ఈమీ యన్యోన్యసంభాషణ దానిని విస్పష్టము చేయుచున్నది.

మి. భా:— (ప్రతినందునితో) మీమోము మిక్కిలి యలసట జూపుచున్నది.

ప్రతి:— దయామయీ! లేదు! భయంకరరాత్రియైనను, నీవు ప్రక్కనున్నయెడ నాకది యుత్సాహజనకమగు నుదయమే! నామీఁద ననుగ్రహముంచి—నీపేరు పేర్కొందువా? ఏలన—నా సంధ్యావందనవేళల దానిని స్మరింపఁ గోరుచున్నాఁడ.

మి. భా:—మిహిరాంశభారతి. (తనలో) అయ్యో! తండ్రీ! నీయాజ్ఞ నుల్లంఘించి పొరపాటునఁ బేరు చెప్పితిని. అయ్యో! ఇఁక నేమిచేయుదు?

ప్రా:— నీపేరు మిహిరాండభారతియా? బ్రహ్మాండమందలి జ్యోతిస్సర్వస్వమంతయు నీయందే మూర్తీభవించి యున్నదనుట యత్యుక్తి యేమాత్రముం గాదు. కేవల నిరుక్తియే. కొనియాడఁదరమే నీ నామమాధురిని. ఈయిల నిను మించిన విలువ దేనికిఁగలదు? అనేకుల వివేకవతుల గౌరవముతోఁ దిలకించితి; అనేక పర్యాయములు వారి వాఙ్మాధురిని శ్రద్ధాయుక్తములగు నా శ్రవణపుటంబులద్వారా గ్రోలి సేవించితిని. ఎంచ రాని మించుఁబోఁడుల నయ్యై యోగ్యతల మించువారని మెచ్చుకొంటిని. కాని, ఎన్నెన్ని యోగ్యత లెందరు పూఁబోఁడులం గూడినను, చంద్రునకు నొక కళంక మున్నట్లు వారల విలువ కొంకొక్కలోపము లేక పోలేదు. ఇట్టి సంపూర్ణాత్మప్రకాశార్ణవము నెందును జూడనైతి. విరించి తా మించి రచియించిన జీవ సంచయమునందలి యుత్తమోత్తమసారమంతయు వింతగ సాటిలేని నీ సొగసున వికసన మొందనిచ్చెను.

మి. భా:— నాజాతిజీవినిఁ నేఁ జూచి యెఱుఁగ. అద్దమందుఁ గానవచ్చు నా ప్రతిబింబముతప్ప మఱియొక వనితా రూపముం జూచియెఱుంగను. పురుషు లనఁబడువారిని గూడ, నిన్ను, నా తండ్రినిఁదప్ప, మఱియొక్కరిం గని

యుండలేదు. ఈ మహాలోకమున మనుష్య విగ్రహము లెట్లుండునో దెలిసికొనఁజాలను. నావినయవృత్తి తోడు—ఏదిమాత్రము నాతండ్రి నాకిచ్చు శరణ మగునో—నిన్నుఁదప్ప మరియొకనిఁ జేపట్టనొల్ల. వస్తుతః నాచిత్తవస్తువు నీకంటె నందగానిరూపమును భావింపఁజాలదు. కాని, ఇట్లు మనస్సునకుఁ దోఁచి నట్లు వాగుటలో నాతండ్రిగారి యాన మీఱుచున్న దాననుగదా !

ప్రతి:— నా నిజస్థితినిబట్టియు నే నొకరాజకుమారుఁడను, భారతీ! రాజు నే యనియుఁ దలంచుటకుఁ గారణము లున్నవి. నీ దర్శనముకొఱకుఁదప్ప — ఇట్టిదారుణపు సేవకు నే నొడంబడుచుంటినా ? నానోటఁ బుల్లం బురుగులుం బడనైన నొప్పుకొనవచ్చుఁగాని యీ కట్టెల మోయుపనికి నొప్పుకొనుచుంటినా? వినుము ! నాయంతరాత్మను వెలువుచ్చుచున్నవాఁడ. నిన్ను వీక్షించిన యీ క్షణమే నాచిత్తము తత్తరముతో నీ సేవ చేయుటకు బయలు వెడలినది; నీయందే వసియించి యీ నాశరీరమును నీ సేవ కర్పించినది. నీకొఱకే గదా నే నిట్టి కట్టెలమోయు కూలివాఁడనైతిని.

మి. భా:— నీకు నామీఁదఁ బ్రేమ గలదా !

ప్రతి:— ఓద్యావాపృథువులారా ! ఓ భూర్భువస్స్వర్లోకములారా! మీరే సాక్షులుగా నేఁజెప్పఁబోవు నీమాటల నాలకింపుఁడు. నా మాటలు బూటకములు కావేని

నాకోరికలఁ గొనసాగింపుఁడు; లేక, వట్టికల్లల నల్లి ప్రేలితినేని నాదురదృష్టమునకు నంతమును గలిగింప కుఁడు. (మి॥ భారతితో) ఈలోకమందలి సమస్తము కంటె నిన్నె యెక్కువగాఁ బ్రేమింతును; నీవిలువయే యెక్కువని భావింతును; నిన్నె యెక్కువగ గౌరవింతును.

మి. భా:- ఇదియేమి? నాయానందమునకుఁగూడ బాష్పము లేలకో!

పరా:-(స్వగతము) ఎంతయు వింతలగు మోహాలతలకు మనోహారమగు సమావేశమే గలిగినది. ఈశ్వరుఁ డీప్రేమాంకూరముపైఁ గరుణావృష్టి వర్షించి కృతార్థముం జేయుఁ గావుత!

ప్రతి:- (మిహిరాండభారతితో) ఏల యీ నీలబాష్పచ్యుతి?

మి. భా:- సాహసించి మీపైన నా యీప్రేమలతను బ్రాకింప లేనట్టియు, నా ప్రాణాధారములైన మీ మోహంపుఁ దీఁగెల నందుకొనలేనట్టియు నీ నాయయోగ్యతకే కాని, ఈ వాగ్వ్యయమేల? మోహము తా నెంత దాగియుండఁజూచునో యంతగా బలిసి బయటఁబడు చుండును. నిర్జనద్వీపమునఁ బెరిగిన నా కీజత్తులమారి సిగ్గేల? పవిత్రమై నిర్మలమై నైజమైన యమాయకత్వమా! నీవే నావాక్కున నిల్చి మాట్లాడించుము. నన్ను వివాహమాడదువేని, నే నీభార్య నగుచున్నాను. కాదేని, నిన్నే జన్మావధి ధ్యానించెదఁగాక, నీ

యర్ధాంగినిగాఁ జేసికొనుటకు నీవు వెనుదీయుదువేమో, కాని, నేనుమాత్రము నీ సేవకురాలనుగాక తప్పను; నీ వేమన్నను సరే. నీట ముంచినను పాల ముంచినను నీదే భారము.

ప్రతి:- నా ప్రియతమ యగు నర్ధాంగివి నీవే. ఇదె నాయావజ్జీవ వినీతికిఁ బ్రారంభము. ( అని మోకరించును )

మి. భా:- అగుచో, నా ప్రాణనాథుఁడవు నీవె

ప్రతి:- తథాస్తు! బానిసలు స్వతంత్రత నెంత తీవ్రకాంక్షతోఁ గోరుచుందురో, అంతతీవ్రముగ నీపాణిగ్రహణము నిదిగో కోరుచున్నవాఁడ. ( అని చేతి నందిచ్చును )

మి. భా:- నాహృదయగర్భితమగు చేయి యిదిగో ( అని చాచును ); ఒక యరగంటవరకు నే సెలవుపుచ్చుకొందును.

ప్రతి:- ఇవె పదివేల కుశలాశీస్సులు.

( భారతీ ప్రతినందులు వేరువేరుగ నిష్క్రమింతురు )

పరా:- ఈ వివాహవిషయమున వీరుభయులు నెంతసంతోషవిస్మయభరితులో నేనట్లు కానోపనుగదా! ఇది యునుగాక వారి గుట్టును నే నంతర్హితుఁడనై కనిపెట్టి యున్నాఁడను. నేను నామంత్రశాస్త్రగ్రంథముల గదికిఁబోవలసి యున్నది. సాయంకాలపుభోజన సమయమునకుఁ బూర్వమే నేఁ జేయవలసిన కృత్యము చాలఁగలదు. ( నిష్క్రమించును )

## రెండవ రంగము.

( ఆద్వీపములో మఱియొక భాగము )

[ కాళీవన, ష్ఠీవన, త్ర్యాంచలులు ప్రవేశింతురు ]

ష్ఠీవ:- నీవు చాలించుమంటే నే నొప్పను. మద్యపుఁబీపా వట్టిదిచేయక వదలను. ఇంకొక గుక్కెఁడి త్రాగుము. ఈమద్యముతోఁడి యుద్ధమున మఱియొక పోటునకు సిద్ధముకమ్ము. ఓరాకాసిసేవకా! ఇంకొక గుక్కెఁడు పీల్చుము.

త్ర్యంచ:- ఈరక్కసి మన కెక్కడ దాపరించెను? ఈద్వీపము లో నంతయు న స్తవ్య స్తమై యున్నది. ఈద్వీపములోని జనసంఖ్య యైదఁట. మనము ముగ్గురము. తక్కిన యిద్దరును మనవంటివారే యైయుందురో! తిక్క మిక్కిలి యగుచున్నది.

ష్ఠీవ:- త్రాగుమురా, రక్కసీ! నే నాజ్ఞాపించుచుంటినిగదా! నీకన్ను లెగాదిగ నటులెట్టుఁబారియున్న వేమి?

త్ర్యంచ:-కన్నులు తలలోనుండక, తోఁకనుండునా?

ష్ఠీవ:- ఈరక్కసికొడుకు మద్యమున మునిఁగియున్నట్లు తాగి నాఁడు. ఇఁక నేనో! లవణసముద్రమే నన్ను ముంప లేకపోయినది. ఇంక సురాసముద్రమునగతి చెప్ప నేల! ముప్పదియైదుకోసులు తోయధిలో నీది గట్టు చేరితిని. బలె! నీవే నాకుఁ దగిన బంటువు.

త్ర్యంచ:- నీక్రింది యనీకినీనాయకుఁడే యనుకొనరాదు? కాని, వీఁడు నిలఁబడఁగలుగుటయే వింత—

స్త్రీ.వ:- రక్కసిదొరా ! మన మీయుద్ధమునఁ బారిపోవు వారము కాములే ?

త్ర్యంచ:-నడచుటయే దుర్ఘటముగనున్న మీ రెట్టులు పారి పోవుదురులే ? కుక్కలవలెఁ బడియుండుటయే మీ యిప్పటిగతి.

స్త్రీవ:- ఓ ! శశిలోనిషసరమా ! నీ నోట మాటయే రాదేల?

కాళీ:- తమ ఘనతకుఁ గుశలమా ? నీ కాళ్ళకు మొ్రొక్కుదును. అతనిక్రిందఁ బనిచేయను; అతఁడు శూరుఁడుకాఁడు.

త్ర్యంచ:- బుద్ధిలేని రక్కసికొడుకా ? నీ తప్పుడుకూతలు కట్టి పెట్టు. ఇప్పుడొక కనిస్టేబిలుతోఁ బెనుగులాడుమన్న సిద్ధముగ నున్నానురా ? తప్పఁద్రాగిన మత్స్యమా ! నేను త్రాగినంత మఱియెవఁడు త్రాగఁగలఁడురా ? నీ యీరక్కసిరూపమునకుఁ దోఁడు, ఈ వెక్కిరి కొక్కిరి యబద్ధపుఁగూఁతలు కూడనా ?

కాళీ:- చూడు ! చూడు ! దొరా ! నన్నెట్లు వెక్కిరించు చున్నాఁడో ! నీవిట్లూరక చూచుచుండుట తగునా ? దొరా !

త్ర్యంచ:-"దొరా" యనియు సంబోధించుచున్నాడు; బలే ! నీవంటి బుద్ధిలేనివాఁడు మఱియొకఁడుండఁడు.

కాళీ:- చూడు ! చూడు ; తిరిగి వెక్కిరించుచున్నాఁడు. దయచేసి, అతనినిఁ జావమోదవు ?

స్త్రీవ - త్ర్యంచలుఁడా ! భద్రము సుమీ ! మాట మిగుల కుము ఈ రక్కసి యిప్పుడు నా యొక్క సేవకుఁడు

సుమా! వానిని నీవిఁక నిందింపకుము. నీ వెరుఱు తిరిగి తివా? ప్రక్కచెట్టునకే విరిచికట్టి యురితీయుదును.

కాళీ:— చిత్తము! దొరా! వందనము! నా విన్నపము మఱి యొకసారెకు జ్ఞాపక ముంచుకొందురా?

శ్లీవ:— తప్పక! తిరిగి కాళ్ళు మొక్కము. నేనె కాను! త్ర్యాంచలుఁడును నిన్ను రక్షించుటలో సాయపడును.

(ఆర్యదాసుఁడు వాయుదేహముతోఁ బ్రవేశించును.)

కాళీ:— నీకుఁ బూర్వమే చెప్పితినిగదా! నన్నిక్కడ నొక్క నిరంకుశప్రభువు వశపరచుకొని యున్నాఁడు. ఒక మంత్రవేత్త! ఈతని మంత్రశక్తిచేత నా ద్వీపమును గాఁజేసియున్నాఁడు.

ఆర్య:— నీమాట శుద్ధాబద్ధము.

కాళీ:— నీదే యబద్ధము. కోఁతివలె నన్ను వెక్కిరింప వచ్చితివా? నాదొర నిన్ను నాశనముచేసిన బాగుండును. నే నబద్ధమాడుట లేదు.

శ్లీవ:— త్ర్యాంచలుఁడా! నీవు కాళీవనుని మాటల కభ్యంతరము కలిగించుచుంటివా! తప్పక నీ పండ్లూడఁ గొట్టుదును.

త్ర్యాంచ:— నీకేల కోపము కలుగవలెను? నేను నోరెత్తితినా?

శ్లీవ:— అయితే, సరె, గప్చుప్—కిమపినాస్తి. (కాళీవనునితో) ఇఁక నీకష్టములసంగతి చెప్పసాగుము.

కాళీ:— ఈ దీవిని మలయాళమంత్రాలతో నీతఁడు సాధించినాఁడు. నన్ను నెత్తియడఁచి సాధించినాఁడు. తమ ఘనత

యతనిని శిక్షించినయెడ, నాకసి తీరును. తమరే యందునకు సమర్థులని నే నెఱుంగుదును. ఇతని కంత ధైర్యములేదు.

స్త్రీవ:— అందునకు సంశయము లేదు.

కాళీ:— అప్పు డీ దీవికి నీవే యధిపతి వగుదువు; నేను నీకు సేవకుఁడ నగుదును.

స్త్రీవ:— ఈ ఘనకార్య మెట్లు నెరవేర్పనగు? అతనివద్దకు నన్నుఁ జేర్తువా?

కాళీ:— ఆహా! అతఁడు నిద్రపోవుతరి, దొరా, నీకుఁ దెలియఁ జేయుదును. అప్పు డతనినెత్తిన నొక్కమేకుమునుకను బొడుతువు, గానిమ్ము.

ఆర్య:— అబద్ధాలవాఁడా! నీతరముకాదురా?

కాళీ:— (ఆర్యదాసుని మాటలను త్ర్యంచలునివిగాఁ బొరపడుచు) ఈ హాస్యగాఁ డెక్కడ మనకుఁ దాపరించినాఁడు? ఈ త్ర్యంచలుని నాలుగు దన్ని చేతిలోని సారాబుడ్డిని గుంజుకొనుఁడు. అది గుంజుకొన్నమీఁద వీనికి నుప్పునీరే గతి. నేను మంచినీ రున్న చోటునైనఁ జూపను.

స్త్రీవ:— త్ర్యంచలా! చెప్పినమాట వినవుగా! పాక మింక ముదురనీయకుము. కాళీవనుని, మాటలమధ్య నభ్యంతరము నీకమీఁదఁ గలిగించితివేని, కనికరమును నా యెదనుండి గెంటివైచి, చేఁపను బొడిచినట్లు పొడిచెదను సుమీ!

క్రౌంచ:-అరె! ఇదేమివింత! నేనేమియు ననకున్నను, మీకిట్లు తోఁచుచున్నదేల? నేను దూరమునకుఁ బోవుదును లెండు.

శ్లీప:- వానివి యబద్ధములని నీ వనియుండ లేదా?

ఆర్య:- నీవి ముమ్మాటికి నబద్ధములే.

శ్లీప:- నావి యబద్ధములా? ఈ దెబ్బతిను (అని క్రౌంచలుని దెబ్బకొట్టును.) ఈ తడవ యభ్యంతరము గణించితివా! చూడు!

క్రౌంచ:-నే నేమియు ననలేదు! నీకు సోఁయి తప్పియున్నది; వినఁబడుటయు లేదు. నీసారాబుడ్డి బుగ్గికాను! నీ రాకాసి సేవకునికిఁ బెద్దమ్మవారు పోను! నీ చేతులు చితిలోఁబడ.

కాళీ:- ఆహా! హా! హా!

శ్లీప:- ఇఁక నీవు చెప్పు వృత్తాంతము పూర్తికానిమ్ము. (క్రౌంచలునితో) నామాటవిని, కొంచెము దూరమునకుఁ దొలఁగుము.

కాళీ:- దిట్టముగఁ గొట్టుము. కొంచెములో నేనుగూడ నీకుఁ దోడగుదును.

శ్లీప:- (క్రౌంచలునితో) కొంచెము దూరముగ నిలువుము. (కాళీవనునితో) ఇఁక నీకష్టముల నుడువుము.

కాళీ:- మధ్యాహ్నసమయమున నిద్రించుట యతని కలవాటు. అతని మంత్రశాస్త్రగ్రంథముల ముందు సంగ్రహించి, అతని తలఁ బగులఁగొట్టుము, లేక, ఒక లాటీ

తో నతని తల తుత్తునియలు చేయుము. అథవా, నీకత్తితో నతని యూపిరిగొట్టమును జీల్చివేయుము. మొట్టమొదట, అతని మంత్రశాస్త్ర గ్రంథములను గాఁజేయవలయును; ఆతని సామర్థ్యము వానింబట్టియే. అవి లేనియెడ, నే నెంతటి మొద్దనో, వాఁడు నంతటి మొద్దె—ఆపొత్తములు లేనియెడ అతనిక్రింద నొక్క భూతపిశాచమును బనిచేయదు. సమస్తభూతప్రేతపిశాచములును వానిని నిజమునకుఁ ద్వేషింపవు నాకెంతటి కసి యతనిమీఁదఁగలదో ఆ పిశాచాదులకు నంతటి కసియే కలదు. నీవాతనిపొత్తములఁ జెత్తవలెఁ గాల్చితివా, చాలును. అతనివద్ద మంచిసామాను కలదు; దానితోఁ దనయింటి నలంకరించును. అన్నిటికంటె విశేషమేమన:—అతనికూఁతురి సౌందర్యము. ఆతఁడె, తన కూఁతునకుఁ బోల్పఁదగిన సొగసుగత్తె యీ లోకమున నే లేదనును. నా తల్లియగు చిక్కురక్కసియు నీతని కొమరితయుం దప్ప మఱియొక స్త్రీని జూచి యెఱుఁగ. ఈమె సొగసునకును, చిక్కురక్కసి యందమునకును, హస్తిమశకాంతరభేదము కలదు.

స్టీవ:— ఆమె యంతటి సౌందర్యవతియా? కానీవనా! వానిని జంపి, ఆకన్యను బెండ్లియాడి రాణినిఁజేసి, నే నీద్వీపమునకు రాజు నగుదును. త్రించెలుఁడును నీవును రాజప్రతినిధులు కావచ్చును. త్రించలా ? ఈ పన్నుగడచే మీ మనుగడయు రుచికరము కాదా !

త్ర్యంచ:-సర్వోత్తమమైన పన్నాగము.

ష్లీవ:- ఏది, నీ చేయి ? చేతికోఁ జేయివేయుము. నిన్నుఁ గొట్టినందునకుఁ బశ్చాత్తాపము కలుగుచున్నది.

కాళీ:-అరగంటలోనే ప్రాస్పెరో నిద్రించును. నీ వపు డతనిని సంహరింతువుగా !

ష్లీవ:- తప్పక ! నా (గౌరవను) తోడు.

ఆర్య:- చిక్కితిరిపో ! ఇది నా యజమానుఁడగు పరాత్పరునితోఁ జెప్పివత్తును.

కాళీ:- నాకు నపరిమితానందమును గలిగించితివి. మనము సంతోషముతోఁ బాడుదమా ? నాతోఁ బల్లవి నందుకొందువా ? ఇప్పుడే నీవు దీనిని నేర్పితివిగదా !

ష్లీవ:- నీవు కోరినట్లే చేయుదము. త్ర్యంచలుఁడా ! పాడుదమా ?

పారఁదోలివైతమా
వీరి మంత్ర తంత్రముల్ ॥పార॥
మనసు నెవఁడు పట్టఁగలఁడు,
ఇనుప గొలుసు లుండినన్ ॥పారదోలి॥

కాళీ:- ఆ పాట రుచికరముగ లేదు.

(ఇంతలో నార్యదాసుఁడు పాడును.)

ష్లీవ:- ఈ పాట యెక్కడినుండి వినఁబడుచున్నది ?

త్ర్యంచ:- ఇది మన కుష పల్లవి. ఆకాశవాణియే కాని రూపము కానరాదు.

ష్టీవ:— ఈపాడిన దెవఁడో? ఓకానరాని పాటగాఁడా? నీవు మానిసివైతివేని, ఎదుటఁబడి కాన్పించుము. లేక, పిశాచమవైతివా? నీగతి నీదే.

త్రింకు:—ఓ, నాపాతకముల సంహరింపుము!

ష్టీవ:—మరణమే యన్నిటికిని శరణము. నేను నీకు భయపడను. దేవా! రక్షింపుము మమ్ము..

కాళీ:— భయపడితివా?

ష్టీవ:— లేదు, రక్కసీ. నేనా? భయపడువాఁడను.

కాళీ.— భయపడకుఁడు. ఈదీవి విచిత్రనాదములతో శబ్దములతో నిండియుండును. అవి యెవరిని బాధింపవు. ఒక్కొక్కపరి, వేలకొలఁది వాద్యములనుండి గీతపరంపర నా చెవులు తూట్లువడ వ్యాపించుచుండును. మఱి కొన్నిసమయములందు మృదుస్వనములు చెలరేగి, అప్పుడే నిద్రలేచియున్నను, తిరిగి నన్ను జోకొట్టినట్లు వెంటనే నిద్రవచ్చును. స్వప్నములు వచ్చి, ఆకసమునుండి సువర్ణవర్షము కురిసినట్లు తోఁచును; మెలకువకలిగినతోడనే, ఆకలయే మఱికొంతకాలమేల యుండలేదని నొచ్చుకొందును.

ష్టీవ:— ఈ దొరుకఁబోవు రాజ్య మొక విచిత్రరాజ్య మగును. గ్రుడ్డిగవ్వ వ్యయము చేయకయే మధురగానము దొరకుచుండునుగా!

కాళీ:— పరాత్పరుఁడు సంహరింపఁబడినమీఁది మాట యది.

ష్ఠీవ:- అది సమీపించుచునే యున్నదిలే. నీవు చెప్పిన దంత
యు మరచితి ననుకొంటివా ?

త్ర్యించ:- ఆ నాద మట్లు సాగిపోవుచున్న ట్లున్నదిలే. దాని
వెంబడియే పోదము; తరువాత, మనపని చేయుదము.

ష్ఠీవ:- రక్కసీ ! త్రోవ చూపుము. మేము నిన్ను వెంబడించి
వత్తుము. ఈ కానరాని పాటగానిఁ జూడఁగోరుచుండు
నా మనంబు. వీని తంబూరలోని స్వనము గంభీరము.

త్ర్యించ:- వత్తువా ? ష్ఠీవనుని వెంటనే నేనును వత్తును.

(నిష్క్రమింతురు.)

## మూఁడవ రంగము.

( ఆ ద్వీపములో మఱియొక మూల. )

[ ఇళాంశుఁడు, శివాస్త్వయనుఁడు, అంధనరుఁడు,
కాంచ్యుఁడు, ఆత్రేయుఁడు, వారణాసికుఁడు,
మొదలగు వారు ప్రవేశింతురు. ]

కాంచ్య:- యశోద సాక్షిగాఁ జెప్పెదును. నే నొక్క యడు
గైన వేయఁజాల. నా కాళ్ళుం గీళ్ళును నొప్పులు
పట్టినవి. ఇది యొక్క యంతులేని వింత గొందుల
పొంత. మీకుఁ గోపమువచ్చినను సరే; నే నిక్కడ
విశ్రమింపక తప్పదు.

ఇళాం:-వృద్ధామాత్యా ! నిన్ను నేమియు ననఁజాల. నేను
మాత్రము కదలఁగలిగి యున్నానా ? క్రిందఁ

గూలఁబడి, విశ్రమింపుము. ఇప్పటికిని నా కాశలు లేవనియే యందును. ఇట్టి నిరాశనున్న నన్ను ముఖ స్తుతి చేయువారలకుఁగూడ నుబ్బించుటకు వీలుం డదు. మన మెవనికై వెదకి వేసారుచున్నామో వాఁడు మున్నీట మునుఁగక యుండఁడు; సముద్రుఁడు మనము భూమిమీఁద నతనికై వెదకులాడుటను జూచి లోలో హేళనము చేయుచుండుటలో సంశయ మేమి? మంచిది! గడచిపోయినదానికి మన మేమి చేయఁ గలము.

అంధ:—( శివాస్త్యయనునితో నపవారితముగ ) వీఁ డిట్లు నిరాశనుండుట నాకు మిగుల సంతోషకరమే. ఒక్క సారి ప్రయత్నము నిష్ఫలమైనదని నీవు సమకట్టిన మహాకార్యమును నిరుత్సాహివై విసర్జింపకు.

శివా:—( అంధనరునితో నపవారితముగ ) ఈ తడవ వీలు చిక్కినప్పుడు సంపూర్ణముగ నెరవేర్తును.

అంధ:— ( శివా॥నునితో నపవారితముగ ) ఆప్రయత్న మీ రాత్రియే కానిమ్ము. ఇత్తరి నడచి నడచి వీరలసి సొలసి యున్నారలు. కావున, వీరంతటి జాగరూక తతో నుండఁబోరు, ఉండఁజాలరు.

శివా:—( అంధనరునితోనపవారితముగ ) సరే! ఈ రాత్రియే. గప్చుప్. ( గంభీరమైన విచిత్రగానము )

ఇళాం:— ఇది యేమి వింతగానము. నా మిత్రోత్తములారా! ఆలకింపుఁడు.

కాంచ్యు:— అద్భుతమైన మనోహర గానము !

(పరాత్పరుఁడు పైనఁ గానఁబడకయే ప్రవేశించును.)

(క్రింద విచిత్రభూతప్రేతాదు లద్భుతకాయరూపములతో విందు వచ్చింతురు. వంగివంగి మృదువుగ సలాములు చేయుచు నాట్యమాడుదురు. రాజును విందారగింప నాహ్వానము చేసి నిష్క్రమింతురు.)

ఇళాం:— ఈశ్వరా ! మంచి దయామయులతో సంఘటనము మాకుఁ గూర్పవా ? ఈ గడచినవి యెట్టి రూపములు?

శివా:— బ్రతికియున్న తోలుబొమ్మల యాటవలె నుండినది. ఇదివరకు నమ్మకున్నను, ఇఁకమీఁద నే నిట్టి భూత ప్రేతాదులను విచిత్రగాథలను నమ్మెదను. ఇవి యక్షో గణములై యుండునేమో ! ఋభుదేశమున విచిత్ర వైనతేయసింహాసనము కల కల్పవృక్షము కలదనియు, ఇప్పు డొక వైనతేయుఁ డేలుచున్నాఁ డనియు నందురు. నిజ మేమై యుండును.

అంధ:— నే నుభయమును నమ్మెదను. ఉభయ మననేల ! నమ్మఁజాలనని యనుకొన్న వెన్నియో నమ్మవలసి వచ్చినది. కూపస్థమండూకములవలెఁ గూడలలో గుట్టాలఁ దోలుచుండు బుద్ధిహీను లెంతనమ్మకున్నను, లోకసంచారము చేసిన ప్రయాణికులలోని యనుభవ జ్ఞులమాటలలో నసత్య ముండదు.

కాంచ్యు:- ఇప్పు డీవృత్తాంతమును నవపురిలోని పౌరులకుఁ జెప్పినచో నమ్ముదురా ? రూపమునకు రక్కసులైనను మన పౌరులకంటె దయామయహృదయములు గలిగిన ద్వీపవాసులను నే నెందరినో చూచితి నని యన్నచో నవపురి పౌరు లెవ్వరైన నమ్ముదురా ?

పరా:- (అపవారితముగ) ఆర్జవముగల సభికవరా ! నీవు మాత్రము సత్యమే వచించితివి. మీ మతాలో నక్కడనున్న కొందరు ఘోరపిశాచములకంటె నీచతరు లన వచ్చును.

ఇళాం:- ఈ వింతలలో నా మనస్సున కేమియుఁ దోఁచుట లేదు. ఇ వేమిరూపము లనుదు. ఇ వేమియభినయములు. ఇదేమి నాదము. నాలుక లేలొకో కదిలినటుండవు కాని, ఇది యొక తోలుబొమ్మల నిరుపమానమగు మూగ సంభాషణ యనవచ్చును.

పరా:- (అపవారితముగ) పోవుచుం బోవుచు మీ యిష్టము వచ్చినట్లు కొనియాడుఁడు.

వార:- ఎంతవింతగఁ బ్రవేశించిరో, అంతకంటె వింతగనే నిష్క్రమించిరి.

శివా:- పోతే పోనిండు; కాని, వారు వడ్డించిన వన్నియు వదిలియే నిష్క్రమించుట మన కనుకూలమే. మన కాఁకటిబాధ విపరీతముగ నున్నది. తమరు దయచేసి యివి రుచిచూతురా?

ఇళాం:- నేనే ! ఒల్లను.

కాంచ్యు:-నామాట నమ్ముఁడు. మీరు భయపడ నవసరము లేదు. మన చిన్నతనమునఁ బ్రపంచయాత్ర సలిపిన వారు కొన్ని ద్వీపములందలి మనుజులకు గంగడోలున్నదన్న మనకు నమ్ముటకు మన సొప్పకుండెను. మఱికొందఱు దేశసంచారులు కొందరికిఁ దల హృదయమున నుండునన్న మనము నమ్మఁజాలకుంటిమి. ఇప్పు డిట్టివింతసంగతుల నెంతటికొమ్ములు మొలచినవారుఁ కూడ నమ్మునట్లు సాక్ష్యమిత్తురు.

ఇళాం:-నేను భుజింప సాహసింతును; తుద కిద్ది నాతుట్టతుది విందు కానున్నను సంశయింపను. నా మంచిదినములు మించిపోయినవి; ఇఁక వెఱవనేల! సభికవరా! నీవును రుచిచూడ సాహసింపుము.

( ఉఱుములు మెఱుపులును విపరీతములగును. ఆర్యదాసుఁడు ఱెక్కలుకల ఖేచరులవలెఁ బ్రవేశించి, బల్లమీఁదఁ దనఱెక్కల జాడించును; ఒకవింత తంత్రముచే విందంతయును మాయమగును. )

ఆర్య:-మీరు ముగ్గురు మహాపాపులు; కావుననే మీపురాకృతఫలము మిమ్ము నిదివరకుఁ బెట్టిన బాధలు మాత్రమేకాక సర్వభక్షకమగు బడబానలముకూడ బయటికి నీదీవిపైన వెడలఁగ్రక్కినది. మీరు సుఖజీవనము చేయ మిక్కిలి యనర్హులు కావున, మనుజరహితమైన యీ దీవిపైకి నెట్టఁబడితిరి. మిమ్ముల నున్మాదమెత్తునట్లు వంచించి కష్టములపాలు చేసితిని. ఎంతటి

శూరులకును సూక్ష్మలోకమును స్థూలశరీరబలముచే వశపరచుకొనుటకు వీలుండదు. ( ఇళాంశుఁడు మొదలగువారందరు కత్తులు దూయుదురు ) బుద్ధిహీనులారా! నేనును నాక్రింది సహాయకులును విధికి భృత్యులము. భౌతికప్రపంచ సంబంధమైన మీ కత్తులు మహావాయువును మహాజలధ్యాదుల నెట్టులిసుమంతయు బాధింప నసమర్థములో యట్లే యీ నా తలపాగలోని యీఁకనుగూడఁ గదిలింపఁజాలవు. ఈ నాక్రిందిభూతగణములు నట్లే మీచేత జయింపఁబడవు. మీరు నన్ను హింసింపఁ దలంచినను, మీప్రకృత దుర్బలదశ మీకత్తుల నెత్తనైననీదు లెంతు. కాని, ఇప్పటికైన మీ పాపకృత్యములు మీకు స్మృతికి రానట్లున్నవి. కావున నేను మీకు హెచ్చరికతో జ్ఞప్తికిఁ దెచ్చుట నాకు విధి. మీరు ముగ్గురు పరాత్పరుని మలినహీనపురినుండి వెడలఁగొట్టితిరిగదా! అతని, నతనిసుతను సముద్రమునఁబడి మునుఁగునట్లు పడవమీఁద నొంటరిగనుంచి నెట్టితిరిగదా! సముద్రుఁడు మాత్రము మమ్ముల న్యాయదృష్టితోఁ గాపాడెను. దేవగణము లన్నియుం బ్రకృతి యంతయు మిమ్ముల శిక్షింప సమకట్టి మీ కశాంతి కలిగించెను. ఇళాంశుఁడా! నీ కొమరునితో నీ కెడబాపు దేవతల యాగ్రహామే కలిగించెను. దేవతలే వారసనాగ్రము నుండి నీకు నిరంతర నరకబాధ తప్పదని పలికించు

చున్నారలు. ఆ నరకమునకంటె మరణమే సహస్ర విధముల మే లనవచ్చును. వారి యాగ్రహమునుండి కాపాడుటకే యీ ద్వీపమున మీరుపడుచున్న కష్టముల పరీక్ష. దీనిమీఁద మీకుఁ బశ్చాత్తాపము కలిగిన నిఁకనైన మీకుఁ గుశలమార్గము దొరుకును; చిత్తశుద్ధి కది సాధన మగును.

( ఇట్లుఱుములతో మాయమగును )

[ తరువాతఁ గొంత సరసగానము సాగి, పూర్వపు భూతరూపములు కాన్పించి, వెక్కిరించుచు నాట్యమాడి, ఆహారపదార్థముల నెత్తికొని పోవును. ]

ప్రా:– (అపవారితముగా) నా యార్యదాసుఁడా! నీ కృత్యమును సలక్షణముగ నెరవేర్చితివి. గడచిన నాటకమున నీ పాత్రనిర్వహణము సర్వాంకషముగు చాకచక్యముతోఁ నొప్పెను. నా యాజ్ఞను సక్రమముగ నిర్వహించితివి. నిన్నుఁ జెప్పుమన్న హెచ్చరికమాటలు సమంజసముగఁ జెప్పితివి. అట్లే, మిగిలిన భూతాదులును దమ కృత్యములను జక్కఁగా నెరవేర్చినవి. నా మంత్రశక్తులు చక్కఁగాఁ బనిచేయుచుండుటం బట్టి నన్ను బాధించినవార లందఱు నొక్కచోటఁగూడి తమ కష్టముల ననుభవించుచున్నారు. వీరందరు నా కిప్పుడు వశమై యున్నారు. వీరి నిట్టి చిక్కులలోనే

ప్రస్తుతము వదిలి, వీరు చచ్చెనని భ్రమపడుచున్న ప్రతినందుఁడును నా కొమరితయు నున్న చోటునకేగి వారి స్థితిగతులు పరికింతును.

( పైఁగా నిష్క్రమించును. )

కాంచ్యు:- ఈశ్వరసాక్షిగాఁ జెప్పెదను : ప్రభువర్యా ! మీ రిట్లేల వింతగా నెగాదిగఁ జూచుచు నిలువఁబడుదురు !

ఇళాం:- అబ్బా ! ఇట్టి స్థితి మిక్కిలి ఘోరము. అబ్ధితరంగములే తురంగలించుచు వచ్చి ప్రసంగతః గతవృత్తమును బేర్కొని గద్దించుచున్నట్లు తోఁచె. మహావాతమే యావృత్తమును గానము చేసెను. పర్జన్యవాద్యమగు నుఱుము పరాత్పరుని నామమునే కొనియాడెను. నాదోషకృత్యమును గురించి జాలిఁ గలిగించు తోడి రాగముతోఁ బాడెను. కావున నానిశ్చయ మేమన, నా యాసల కాటపట్టగు నాపట్టి సంద్రంపు టడుగునఁ బూడికొనిపోయియుండక తప్పదు; నేనుగూడ నంతటి లోతులకే మునిఁగి నాముద్దులకొమరుని పజ్జ బజ్జ కొనుట మేలు. ( అని నిష్క్రమించును )

శివా:- ఒక్కొక్కఁడు తలపడినయెడ, ఈ భూతప్రేతాదు లెన్నిలక్ష లున్నను నేను బోరాడుటకు వెనుదీయను.

అంధ:- నీకు బానిసనై నే నుందునుగా !

( వీ రిద్దరు నిష్క్రమింతురు )

కాంచ్యు:— ఈ తరలిన ముగ్గురును మూర్ఖాగ్రేసరచక్రవర్తులు. వారు చేసిన మహాదురితము, కాలము గడచినకొలఁది, వారి మనస్సాక్షిని మేలుకొలిపి, పశ్చాత్తాపాంకూర వికారములచేఁ బెరిగి మనస్సును గొరుకుచున్నది. వారలకంటె శాంతస్వభావము గలిగి వేగమున నడవఁ గలిగిన యీ మిగిలిన మిమ్ముల వారిని వెన్నంటిసాగుటకును, వారిదుఃఖావేశమున నాత్మహత్యాదులు చేసికొనకుండఁ గాపాడుటకును వేడుచున్నాఁడను.

అడ్రి:— వారి వెనువెంటనే దయచేసి సాగుఁడు. త్వరపడుఁడు.

( నిష్క్రమింతురు )



# చతుర్థాంకము.

## మొదటి రంగము

(పరాత్పరుని గది ముందర)

[ప్రతినందుఁడు, పరాత్పరుఁడు, మిహిరాండభారతియుఁ ప్రవేశింతురు]

పరా:— మిమ్ములఁ బరీక్షించుటకై మిక్కిలి కష్టపెట్టితిని; గాని, దాని ప్రతిఫలరూపమైన మీ యన్యోన్యమోహాబంధమే నా క్షమార్పణ కనుబాధము. అట్లు చేయుటలో నా కనుష్ఠేయములుగ స్వీకరించిన పురుషార్థముల సాధనసంబాధమగు నాటకములో మూఁడవ యంక మియ్యది యనియే నా నిర్ణయము. ఇంతయేల? ఈ చక్కని చుక్కను గన్న నా యర్ధాంగి గతించిన మీఁద నా జీవితశేషమును గడపుటలో నీను వివాహామే నా యాశయముల పరమావధి. ఈమె పాణిగ్రహణమును మఱియొకసారి నా యెదుటఁ జేయుము. మీ యుభయులకును విసుకును గలిగించిన కష్టకృత్యములన్నియు మీ యన్యోన్యప్రేమను బరీక్షించుటకే. నా కఠినపరీక్షలో మీరు సర్వోత్తమముగ నుత్తీర్ణులైనారలు. ఇప్పు డీశ్వరసాక్షిగ నేఁ జేసిన కన్యాదానమునకు నీ చేత నీమె పాణిపద్మంబును గూర్చుటయే నా సంతసము. ఇంతకంటె విలువకల దాన

ముండఁ బోదు. ప్రతినందా! ఈమె యొక్క సర్వాంగసౌందర్యమును గుఱించియు సకలసుగుణగణములఁగూర్చియు నేనింత యహంకారముతో నుబ్బుచున్నానని నీవు చిరునగవును వ్యక్తపరచుట కవసరములేదు. భావినీభావసంభావనకు భావజుఁడే సాక్షియై నాస్తుత్యాభాసము లామె నిజప్రతిబింబమున కెంతగ వెనుకఁ బడుచున్నవియో తెలిసికొనదవుగాక!

ప్రతి:- మీ యీ వాక్యముల వేదవాక్కులుగ నే నమ్మెద.

పరా:- నాదానరూపముగ నైననేమి, లేక, నీయోగ్యతాప్రతిఫలరూపముగ నైననేమి, ఈ చిన్నికన్నియను నెయ్యమునఁ బాలించుకొనుము. ఇఁక నీమె నీయది యె. ఆమెతోడి సల్లాపసుఖముల కిఁక నెట్టిప్రతిబంధము నుండఁబోదు. ( ఆర్యదాసు నుద్దేశించి ) ఆర్యదాసా! కష్టమునకు వెనుదీయని నాసేవకరత్నమా! ఎక్కడ!

( ఆర్యదాసుఁడు ప్రవేశించును )

ఆర్య:- ఇదె! వచ్చుచున్నాఁడను. మహానుభావుఁడగు నా యజమానుని యాజ్ఞ యెయ్యదియో!

పరా:- నీవును, నీ సేవక భూతగణములు నిన్నటి ఘనకార్యమును సమంజసముగ నొనర్చిరి. మిగుల సంతసమొందితిని. అట్టిదె మఱియొక ఘన శుభకార్యము మీరు సమకూర్పవలసి యున్నది. పోయి నీ సేవకులగు

భూతగణములఁ బిలిచికొని రమ్ము. వారిని బొందఱ చేసి నా మంత్రశాస్త్రమహిమలను నూతన వధూవరుల యెదుటఁ జూపునట్లు నీవు చేయింపవలసియున్నది. ఇట్లు నేను వారికి వాగ్దానము చేసియున్నాను; కావున నిట్టి మంత్రసిద్ధులఁ జూడ నుత్సుకులై యున్నారు.

ఆర్య:— ఇదె! వచ్చితిని.

పరా:— ఒక నిమేషమున రావలయును.

ఆర్య:— మీరు "రా, పో" అని నుడువు వ్యవధిలోనే రెండు హంసల శ్వాసమును విడుచుకాలములోనే, నా భూతగణము లన్నియుఁ దమ తమ పనులకు సంసిద్ధములై యుండును. పరేశా! నాపని మెచ్చుకొనరుగా?

పరా:— ప్రియతరముగా? మంచిది! ఆర్యదాసా! నీ భూతగణములం బుష్కలముగ వెంటఁ గొని రమ్ము. వెంటనె; సందర్భశుద్ధిగ; పలుకు వినఁబడరాదు; కనులఁ గనఁబడవలయు. అలికి డింతయుఁ దగదు, తళుకు మెఱుపువలెన్. (గానము మృదువై సాగును.)

( సరస్వతి ప్రవేశించును )

సర:— కలుముల తల్లీ! కల్పకవల్లీ! జగములతల్లియు దేవనాయకియు నగు మనమూలపుటమ్మ నినుఁబిలువ నంపెనమ్మ. తులలేని సస్యసమితిం బలువిధముల యవల గోధుమల ముద్గములన్ దిలలం గడువెలిగెడి భూవలయపుటావాస మిపుడు వదలుమనెఁగదా!

దూరపుదృష్టికి రమ్యము
లై రెపరెపమేయు పసుల యరపుల కేవిఁ
శారికల కీరముల వా
గ్ధారల ఝరధారలఁ సుధల్గొను గిరులఁ
గోదాదినదుల కిరవగు
మైదానపుఁ బచ్చికలను మసలెడి పసులఁ
నై దాఘసమయమందున
నాదరి యీదరియు నోరయు నమరనది రుచిఁ
పాటలముఖ సుమతరులఁ
దీటగుతోఁటలను డాకతీఁగలగములఁ
నాటిన చప్పరముల నీ
పాటున నే విడచిరమ్మ పావనియాజ్ఞఁ
నీలకంఠంబుల నీలాపుఁగాంతుల
లీల కాంచెడి నదె లెమ్మ గనుము
( సిరి ప్రవేశించును )

సిరి:— జయ ! జయ ! సర్వవర్ణవిభాసినివగు సరస్వతీ ! సర్వదేవతాసేవితయగు శ్రీమాతయాజ్ఞను నీవలె శిరసావహించువారలు మఱియెవరుకలరు. నా భూవలయము మీఁది సర్వద్రుమ కిసాలయ కుసుమరాశిపై నీపచ్చని కళాలహరిని వెదచల్లనియెడ నాకలుము లెందుఁ గుందిపోవునో సీసకల కళామృతములం గోరంతైనం గ్రోలనియెడ నీచరాచరప్రపంచ మెందు డిందునో ! నీస ప్తవర్ణాంతిమ నీలమణి నీలప్రకాశములనుచేఁగదా

యీ యేజడనేజజ్జగద్విలసనము ! ఈపరిచ్ఛిన్నస్థలికినన్నాపరదేవియే రమ్మనె

సర:— ఒక బ్రాహ్మవివాహమును దిలకించి వధూవరుల దీవించి కలుముల నొసంగనే.

సిరి:— దివ్యతేజోమయి ! నీవచ్చుట శ్రీమాతృసన్నిధిలో శుక్రలక్ష్మినిఁగాని యామె పుత్రునిఁగాని చూచి యుంటివా ? నాబిడ్డ నా నల్లునియముఁ డపహరించు టలో నీగ్రుడ్డిమన్మధుఁడు తోడ్పడెను గాన నే నది మొదలుకొని వారిం జూడ నని శపథము చేసితిని.

సర:— వారితో సమావేశ మగునని సంశయింపం బనిలేదు. ఆమెయు నామె పుత్రుఁడును బారావతవేగధారావంత మగు పుష్పకముమీఁద నెక్కి ప్రభాసమువైపుగఁ బోవుచుండఁ జూచితిని. ఇక్కడ నీనూతనవధూవరుల మీఁద వివాహనిశ్చయము కాకముందు వారియస్త్ర ప్రయోగములు చేయఁజూచిరి; కాని వారి ప్రయత్నములు వ్యర్థము లయ్యెను. శుక్రలక్ష్మియుఁ గొంటెల గంధర్వుఁడగు ( గందిరీగవంటి ) కంతుఁడును దరలి పోయిరి. పూవిలుకాని యమ్ము లన్నియు విరిగి వమ్మైన నతఁ డస్త్రసన్న్యాసమును స్వీకరించి, బాలలీల లం గాలముపుచ్చుకొనుచుఁ బిచ్చుకలతో నాడుకొనుచుండ నొట్టుపెట్టుకొనెను.

సిరి:— అదుగో ! శ్రీమహారాజ్ఞి దేవనాయకి విజయము చేయుచున్నది. ఆ పదద్వయప్రభలు నిరుపమానములుగదా.

( శ్రీమహారాజ్ఞి ప్రవేశించును )

దేవనాయకి:- నాకలుముల చెలియలు కుశలమా! మన మీ వధూవరులను సత్సంతానసౌభాగ్యసిద్ధి కలుగునట్లు దీవించి వత్తము; రమ్ము.

( మానినీవృత్త గానముతో నాశీర్వాదము )

దేవ:- గౌరవజీవనభూరిధనాగమకల్మషహీనమనోనుస్మృతుల్ ।
పౌరుషసంతతి దీర్ఘతమాయువు పర్వపరంపర భాసిలుతన్.

సిరి:- పారములేని సుభూధనధాన్యవిపాకవిశిష్టసమస్తరసా
సారములున్ బహుసస్యతతుల్ సుచసంతలతాంతము లొప్పసదా!

క్షామ మనెడిమాట యెపుడు జనుల చెవులఁబడక యే
సామ దాన భేదములనె సర్వకార్యసాధనల్
ప్రేమ సాగి వెలయుఁగాతఁ చిన్నపెద్ద కొలములన్
రామరక్ష యాంధ్ర బాలు రందు నెపుడు నొప్పతన్॥

ప్రతి:- ఇదియొక విచిత్ర దివ్యదృష్టిమహిమయె! ఈ మాత్ర మహిమ సరసతచే మించుచున్నయది ఇవి యన్నియు భూతగణములే యనుకొన సాహసింతునా?

పరా:- నా మనోరథఫలప్రాప్తికై నా మంత్రశక్తిచే నావాహనము చేసిన మహాయోగినీగణ మియ్యదియే.

ప్రతి:- నాకిదే కైలాసవిలాసమును మించునట్లున్నది. నే నిచ్చటనే యెప్పటికి నుందునుగాక! ఇంతటి యద్భుత విద్యామహిమలుగల మామగా రిందుండుటచే దీనికి స్వర్గతుల్యత యెట్లురాదు.

( శ్రీ మహారాజ్ఞియు సిరియుం గుసగుసలాడుచుందురు. అంతట సరస్వతి నేదోయొక పనిమీఁదఁ బంపుదురు. )

పరా:— నా యనుంగు చిన్నలార ! నిశ్శబ్దముగ నుండుఁడు. సిరియు శ్రీమాతయుం గుసగుసలాడుచున్నారలు. మఱి కొంత మంత్రమహిమా చమత్కృతి శేషించియున్నది. మీరు మౌనమును వహింపని-చో మంత్రమహిమ చెడును.

సర:— (అప్సరసలతో) సురాలయ హిమాలయాది పర్వతో ద్భూత మహానదీనద తటక్రీడానిరతలగు నప్సరసలార ! నాయఁడుకుల సంజాతలార ! మీ నీలోత్పలాదికర్ణ భూషణములను, హిమానీ సమానీతశీతల సౌరభిత వాతపోతవిలసిత హిమవత్కందరాలయముల నించుక వదలివచ్చి యీ కళ్యాణోత్సవమున వధూవరుల నానందింపఁజేసి దీవించి మంగళసూత్ర స్పర్శనము కావించి మించులమించు కులుకుల నాడవలయును.

( అప్సరసలు నాట్య మాడుదురు. )

( కొంతతడవైన మీఁదఁ బరాత్పరుఁడు మౌనమును విడిచి తత్తరపాటును జూపును )

[ అంతట విచిత్రశబ్దములు సాగ నందరును మాయమగుదురు. ]

పరా:— (స్వగతము) అరే ! ఎంతపొరపాటు బుద్ధిలోఁగలిగె? కాళీవనుఁడు మొదలగు దుష్టులు నన్ను హింసింప సమ కట్టినమాట మరచితిని. వారు నిర్ణయించిన ముహూ-

ర్తము సమాసన్నమై యున్నయది. ( భూతగణము లతో ) మీకు నేఁతయుం గృతజ్ఞుఁడను.

ప్రతి:— ఇది గొప్పవింత ! నీ తండ్రిగారి ముఖవైఖరి యేలొకో కలఁతనొందియున్నది. ఎవ్వరిమీఁదనో యంతరంగమున నాగ్రహావిష్టులై యున్నట్లు గాన్పించుచున్నారలు.

ఆంధ్ర మి. భా:— ఇంతవరకు నెన్నఁడును మాతండ్రిగారి నిట్టి యాగ్రహావృతముఖలక్షణములతోఁ జూచియుండలేదు.

పరా:— అల్లుఁడా ! భయపడినట్లు నీముఖవైఖరివలనఁ దోఁచుచున్నది. శాంతి వహింపుము. మన కల్యాణోత్సవ సంబంధమైన తొందర లన్నియుం బూర్తియయ్యె. ఈ జరిగిన చిత్రనాట్యనాటకములు భూతజాతకల్పితములు. అవియన్నియు మహాభూతములందే విలీనములై యస్తమించినవి. ఈస్వప్నసదృశమగు నైంద్రజాలిక భాణప్రపంచ మెట్లో, అట్లే, మిన్నంటు గోపురంబులున్, గన్నదరు రాణ్మందిరంబులున్, మహాగభీరభక్తిభావోద్భోధాలయంబులగు దేవాలయంబులును, ఇంతయేల, నామరూపాత్మకంబైన సమస్తవస్తువిస్తరముతో నెప్పునీజగత్తంతయును, సరస్వతీచతుర్ముఖుల యీక్షామాత్రముచే నావిర్భవించుచు, సాత్వతాగ్రేసరు మహిమచే ననేకభూమికల మించి, మాహేశ్వరుని తమోమాయలో లీనమై తిరోధానముం జెందును. గడచిన మాహేంద్రజాలికరూపము లెట్లి పుడు శేషించి యుండలేదో, అట్లే యీ జాగ్రత్స్వ

పంచ మంతయుఁ దిరోభావముం జెందినమీఁద శేషింపదు.

మనమును, జూచుట కిట్లు
న్నను జాగ్రదవస్థయందు నానాశక్తుల్
మనముల వెలయుచుఁ, గలల
గనుచు, సుషుప్తిన విలీనగతి నంద మొకో ॥

ఇది దైనందిన ప్రళయము; ఇట్టే యెన్నియో చిల్లర ప్రళయములు; ఇట్టే మహాప్రళయములు. తిరిగి సృష్ట్యావిర్భావములు; అంతట స్థితియం దధికారానుసారమగు నానందానుభవములు; తిరిగి ప్రళయము. నాయనా! నాకు విసుకు కలుగుచున్నది. నా యీ దౌర్బల్య ప్రకోపమును జూచి మీరు సహనముం జూపవలయును. వృద్ధుఁడనగు నామెదడు కలఁత నొందుచున్నది. నాపెద్దతనపు దౌర్బల్యమును జూచి మీరు కలఁత నొందకుఁడు. మీ కనుకూలమైనయెడ నాగదిలోనికిఁ జని విశ్రమింపుఁడు. కొంచె మిటునటు పచారిచేసి నేనును బుద్ధికి విశ్రాంతినిఁ గలిగించుకొందును.

ప్రతి. మి॥ భా:— ఈశ్వరుఁడు తమకుఁ జిత్తశాంతినిఁ గలిగించును గాక! ( నిష్క్రమింతురు )

( ఆర్యదాసుఁడు ప్రవేశించును. )

పరా:— నా మనస్సు నిన్నుఁ దలంచిన మాత్రమున నే, ఆర్యదాసా! మనోవేగమున వచ్చితివి. రమ్ము. నీకు మిక్కిలి కృతజ్ఞుఁడను.

ఆర్య:— నేను మీ మనోవికసనముల వెంటనంటియే వర్తింతును. తమ మనోరథ మెయ్యది ?

పరా:— ఆర్యదానా! కాళీవనుని హింసాత్మకములగు పన్నాగములకుం బ్రతిక్రియలఁ జేయవలసియున్నది.

ఆర్య:— ఔను, ప్రభువరా! నేను సిరివేసము వేయఁబోవుచు మీకు ముందు నివేదింపఁదలంచితిని, కాని, మీకుఁ గోపము వచ్చునేమోయని చెప్ప వెఱచితిని.

పరా:— ఆ దుర్మార్గుల నెచ్చట వదిలివచ్చితివో మరలఁ జెప్పుము.

ఆర్య:— వారు తప్పఁద్రాగి నేత్రాంచలముల నిప్పులఁ గ్రక్కుచుండిరని చెప్పియుంటినిగదా! వారియెడ లెఱుంగని మూర్ఖసాహసము నేమని వర్ణింతును. వాయువు వారి నాసారంధ్రములం జొరఁబడుచున్నదని కోపించి వాయువును ఖండింప నుంకించుచుండిరి. వారి పాదముల స్పర్శకుఁ గోపించి భూదేవిని బాదఁ దలంచుచుండిరి. ముఖ్యమగువారి దురుద్దేశము విషయమై మాత్రము బుద్ధి చెదరక యేకాగ్రమైయున్నది. అంతట నా తంబూరమీఁద మీటసాగితిని. అంత వారు బండికిఁ గట్టని గుఱ్ఱపుఁబిల్లలవలెఁ జెవుల నిక్కించి, కన్నులం దెఱచి, మోముల నెత్తి నాదరస మనుభవింప సాగిరి. మాంత్రికుఁడు వశపరచుకొనునట్లు వారిని వశగతులం జేసికొంటిని. దూడలు తల్లియొక్క యంబా యను నరపు విని, ఆ శబ్దంపుజాడం దుముకుచుం బోవునట్లు,

నా నాదము నాలించుచుం బొదలనక, పొదలనక, గుట్టలనక పుట్టలనక, ఎగుడనక దిగుడనక, ముల్లనక, కల్లనక, ముండ్లు గుచ్చుకొనుచున్నను లక్ష్యపెట్టక నా వెంబడి రాసాగిరి. తుట్టతుదకు వారిని మీఁగడికి నావలనున్న బురదగుంటలో దిగంబడునట్లు చేసి కంఠదఘ్నముగ వారినందు వదలి, యిట నిఁక మీయాట లాడుఁడని మీకడకు వచ్చినాఁడను.

పరా:— నా ఖేచరరత్నమా! నీ చమత్కారమునకు వంకలుండునా? నీ యదృశ్యకరణీలఘిమాశక్తులు సన్ను వదలవులే. నా యక్షిణీతంత్రయంత్ర సముదాయమును లోపలనుండి తెమ్ము. ఈ కత్తెరదొంగలను మోసపుచ్చి బాధింతము.

ఆర్య:- నేఁ బోయివత్తును. (నిష్క్రమించును.)

పరా:- (తనలో) ఈ కాళీవనుని దుష్టజన్మము నేమని వర్ణింతును? కుక్షినఁ బడ్డ దాదిగను రాకుసి యిద్ది. ఇఁకఁ బెంపులోని నేర్పులు మహామహిమల్గల వైన నిసర్గజాత దుర్జాతిగుణంబులం బరిహరింప సమర్థము లెట్టులౌను. వేఁపమొక్కలను బానకములఁ బెంచినను, వాని యాకులలోని చేఁదును గాయలయందలి చేఁదును మనము పోఁగొట్టంగలమా? నేనెంతటి జాలినోపూని, ఎంతటిశ్రమనో సహించి, మించినవిద్దెల నేర్పి పెంపనెంచినఁ, సకలంబును మదీయ పరిశ్రమంబు పూర్ణముగ వ్యర్థమయ్యెఁగదా! గాడిదపిల్లయొక్క కోమ

లత్వమువలె మొట్టమొదట నెట్లున్నను, వయసుముదుర ముదుర నీతని తను నెంతటి కురూపమును దాల్చు చున్నదో, ఈతని మనస్సును నంతకంటె దుష్టకర్మలఁ జొరఁబడుచున్నది. ఈ దుష్టచతుష్టయమును గొంతెత్తి నాయిష్టము వచ్చినట్లు శపింతును. (ఆర్యదాసుఁడు మిగుల విలువకల గుడ్డలు మొదలగు వస్తుజాతమును మోసికొనివచ్చును.) (ఆర్యదాసునితో) రమ్ము ఈ దుస్తుల నీ దండెములమీఁద నారవేయుము.

( పరాత్పరుఁడును, ఆర్యదాసుఁడును రూపరహితులై యుందురు. )

[ అంతటఁ గాళీవనుఁడును, క్షీవనుఁడును, దభ్రంచలుఁడును దడిబురద బట్టలతోఁ బ్రవేశింతురు. ]

కాళీ:— చప్పుడేమాత్రమును జేయక దయచేసి నడువవల యును. చెదలు పురుగునకైన నడుగుచప్పుడు వినఁ బడకుండనే మీరు నడువవలయు. ఆయన గదిసమీప మునకు మనము చేరినారము.

క్షీవ:— రక్కసీ, నీవు మిగుల ననపాయయని వర్ణించుచుంటివి మనల నందర మోసపుచ్చి బురదగుంటల కీడ్చినది. ఏమందువురా? రక్కసీ! వినుచున్నావా? చూడు— నాకు నీమీఁదఁ గోపము వచ్చెనా—చూడు.

దభ్రంచ:—నీగతి మిగుల దుర్గతియగును.

కాళీ:— నామంచిదొరా! నాపై మఱికొంచెము సేపు దయ యుంచి నమ్ముము. ఓర్పును గొంతతడవు వహించితి రేని

నేను మీకుఁ జిక్కించు లాభము మీ యీ కష్టము లన్నియు మఱచునట్లు చేయును. కాఁబట్టి, రహస్యముగ మాటాడుఁడు:-

నడిరేయివలె నిచ్చట నంతయు నిశ్శబ్దముగ నున్నది.

త్రించ:- కాని మనసారాబుడ్లు బురదగుంటలోఁ బోఁగొట్టు కొనుట, —

ష్టీవ:- అంతకంటె నవమానపుం గృత్యము నిందయు నెం దుండును! ఆ నష్టముకంటె నెక్కువ నష్ట మొకటి యుండఁజాలదు.

త్రించ:- ఇట్లు తడిసినందునకు నాకుఁ జింతలేదు, కాని మన సార నీరమునఁ బడిపోవుటకు సహింపఁజాల. ఇంతగఁ గష్టములపాలు మన మగుచున్నను, నీ వాయచ్చర ననపాయ దయామయి యందువుకాదూ!

ష్టీవ:- బురదగుంటలోఁ దల మునుఁగ దిగంబడినను సరే, నేను నా సారబుడ్లను వెదకి తెత్తును.

కాళీ:- నాదొరా! దయయుంచి చప్పుడు చేయకుఁడు. ఇదిగో! ఇది చూచితిరా! ఇదియె గుహాద్వారము. చప్పుడు చేయక లోనికి దూరుఁడు. నీవు చెప్పిన ఘన కార్యము చేసితివేని నీ వీ దీవికి సదా రాజ వగుదువు; నేను నీకు సదా సేవకుండ నగుదును

ష్టీవ:- (త్రించలునితో) ఏది! నీచేయి! నేను దలంచిన ఘోరచింత లప్పుడే యంకురించి నాచిత్తము నావ రించినవి.

త్రియంచ:- శ్రీవనరాజుగారూ! ఓప్రభూ! ఇట్లుతిరిగి చూడుము. నీకెంత విలువగలదుస్తులు సిద్ధముగఁ బఱచియున్నారో! చూడుు.

కాళీ:- వానిని ముట్టకుము. బుద్ధిహీనుఁడా! లోనున్న విలువ కల వస్తుజాతముముందఱ నిది వ్యర్థ మనవచ్చును.

త్రియంచ:- పో! పోరా! రక్కసి పోరా! ప్రాతగుడ్డలమ్ము సరకులకు మంచిసరకులకును భేదమును నీవా మాకు బోధించువాఁడవు. ఆహాహా! శ్రీవనప్రభూ!

శ్రీవ:- ఆ గౌనును నీవు తొడుగుకొనఁదగవు. అది నాకే తగును.

త్రియంచ:- తమ ఘనాధికారమునకే యది తగియున్నది.

కాళీ:- నంజురోగము పుట్టి యీ బుద్ధిహీనుని ముంచుఁగాక! ఇట్టి దరిద్రగొట్టు సరకులమీఁదఁ గన్నువైచిన నేమి ఫలము. మనము ముందునకు సాగి, నిశ్చయించు కొన్నట్లు హత్యను మొదటచేసి, తర్వాత జాగెంతచేసి నను నష్టములేదు. ఆ పరాత్పరుఁడు మేల్కొనెనేని మన శరీరముల నాశిఖానఖము సూదులం గ్రుచ్చి మనను వికృతరూపులనుగాఁ జేసివైచును.

శ్రీవ:- ఓరి! రక్కసిబిడ్డా! నీవు నీనోరు మూయుదువా? ఏమి! దండెమా? ఇది నా వస్తుకాదూ? నిన్నదె త్రాటిమీఁదినుండి గుంజినాఁడను. (ఈబట్టల కీత్రాడు తగదు. బట్టతల గలవానికి బల్వెలగలనూనె లేల?)

త్ర్యించ:- కానిమ్ము. ఇల్లు గుల్లయగునట్లు తస్కరింపుము. నీ శ్లేషలకుం గృతజ్ఞుఁడను; నీ శ్లేష కిదె యొకదొంగ దుస్తుబహుమతి. నే నీదీవికి రాజునై యుండఁగ, సరస కవులకు బహుమతి లేకపోవుటయే? నీ మాటలలో దేశీయములు మెండు. నీ దేశ్యరచన కిది మఱియొక బహుమతి.

త్ర్యించ:- ఓరీ! రక్కసీ! రారా! కొంత పిట్టల బంక పూసికొని, పిట్టల నన్నిటిం బట్టినట్లు మిగిలిన బట్ట లన్నియుం గాఁజేయవేమిరా!

కాలీ:- నా కివి యేవియు వలదు. వ్యర్థముగఁ గాలహరణ మగుచున్నది. ఆతఁడు మేలుకొనెనేని, మనల నందరను బాతులనుగానో కోతులనుగానో మార్చివైచి యవమానకరములగు రూపములతో నుంచును.

ష్టీవ:- రక్కసీ! నీవే కృపయోగించి యీ దుస్తుల నన్నిం టిని మన సారపీపా యున్నచోటికిఁ జేర్పుము. నా మాట వినకుంటివా యిదె నా ద్వీపమునుండి తరిమి వైచెదను. పోరా! మొద్దు! దీనిని మోయుము.

త్ర్యించ:- ఇది కూడన్.

ష్టీవ:- రా! ఇది కూడన్. ( ఇట్లు మోయలేని బరువు వైతురు )

[ వేఁటకాండ్ర యరుపులు వినవచ్చును. అనేక భూత ములు కుక్కలవలె వేఁటకుక్కలవలెఁ బరుగిడి వచ్చి

పీఠిపైనఁ బడును. పరాత్పరుఁడును, ఆర్యదాసుఁడును వేఁటకుక్కల నుసికొల్పుదురు. ]

పరా:— పర్వతా! ఇస్కా.

ఆర్య:— రజతమా! ఇస్కా! రజతమా! ఇటు!

పరా:— భయంకరమా! అటు! నిరాఘాటా! అటు విను!

( కాళీవనాదులు తరుమఁగొట్టఁబడిరి. )

పోయి నా భూతతతితో వారి కీళ్లు పట్టుకొని పోవునట్లు చేయుమని చెప్పుము; వారి నరములు బిగిసికొనిపోవునట్లు చేయుమనుము. వారి రూపములను జిఱుతపులులవలె నడవిపిల్లులవలె మార్చివేయుమనుము.

ఆర్య:— ఆ సింహగర్జనములఁ బోలు మొఱుగులు వింటిరా?

పరా:— వారి నట్లే వేఁటాడఁబడనిమ్ము. ఈ క్షణమున నావిరోధులందరు నాకు వశవర్తులై యున్నారలు. కొద్దికాలములో నా శిక్షావిధానములన్నియుం గొనసాగి పూర్తియగును; నీకు సంపూర్ణ స్వాతంత్ర్యము లభించును. ఇఁక నొక క్షణముమాత్రము నా సేవలో నుండుము.

( అందఱు నిష్క్రమింతురు. )



# పంచమాంకము.

## ప్రథమరంగము.

( పరాత్పరుని గదియొదుట. )

[ పరాత్పరుఁడు తన మాంత్రికవస్త్రములతో నార్యదాసునితోఁ బ్రవేశించును. ]

పరా:- నా ప్రయత్నము లన్నియు సఫలతం జెందఁబోవు చున్నవి. నా మంత్రము లప్రతిహతములు. నా భూత గణములు నయభయములతో మెలఁగుచున్నవి. నా కాలపురుషుఁ డడ్డులేక నిర్భయుఁడై నడచుచున్నాఁడు. ఇప్పు డెన్నిగంట లైనవి ? ఆర్యదాసా !

ఆర్య:- ఆరు కొట్టనున్నారు. తాము మన పనులన్నియు నప్ప టికిఁ బూర్తియగునని సెలవిచ్చితిరి.

పరా:-ఈమహావాతూలము నుదయింపఁజేసినప్పు డట్లే చెప్పి యుంటిని. రాజును, అతని పరిజనము నెట్టిస్థితిలో నున్నారో చెప్పుము.

ఆర్య:- మీ రప్పుడు చూచి నావశము చేసినతోడనే యెట్లు బందీకృతులై యుండిరో, అట్లే యున్నారు. మీ గదికిఁ జుట్టు నీడఁ గలిగించుచుండు నిమ్మతోఁటలో శృంఖలబద్ధులై యున్నారు. నీవు వచ్చి విడుదుల కలి గించువరకు నొక్క యడుగైనఁ గదలనేరరు. రాజు, అతని తమ్ముఁడు, నీ తమ్ముఁడును ముగ్గురును దుఃఖ

కూపమున మునిఁగి యున్నారు తక్కినవారును దుఃఖా ద్భుతరసాంబుధిలో మునిఁగి గిలగిలఁ గొట్టుకొను చున్నారు. కాని, మీరు వీరలలో యోగ్యుఁ డని చెప్పిన కాంచ్యుఁడు పడుచున్న పశ్చాత్తాపమునకుం జింతకును మితియే లేదు; అతని కన్నులనుండి బాష్ప ధారలు పూరికొంపమీఁదినుండి జారు జడివానధార లుగాఁ బ్రవహించుచున్నవి. మీమంత్రశక్తి వారల నందరిని మిక్కిలి హీనతమమగు కష్టస్థితికిం దెచ్చి నది; వారినే మీ రిపుఁడు చూచితిరేని మీకుం గరం బుం గనికరంబు పొడమక తప్పదు.

పరా:- నీవు నట్లు తలంతువా?

ఆర్య:- నేనును మనుజుఁడనై యున్నచో, నాకు నట్టి జాలి పుట్టియుండక తప్పదు.

పరా:- నా కట్టియెడ జాలి పుట్టితీరును. భూతజాతి సాజాతుఁడ వగు నీకే యంతజాలి కలుగుచున్నచో, మానవజాతిం బుట్టి వారివలెనే యింద్రియప్రేమలు కలిగి, కామాదులకు వశుఁడ నయిన నాకు ననుకంప ముదయింపక యెట్లుండును. వారు చేసిన మహాపాప కృత్యములకు నామన మ్మెట్లు కుందుచున్నను, నా జ్ఞానశక్తికి నేను వశుఁడనై, క్రోధాదుల తీక్ష్ణతల నణఁచి, క్రియాశక్తిని వినియోగింతును. కసి దీర్చి కొను స్వభావము లోకమునం దంతట నైజముగనే విస్తరించి యున్నది. నైతికమగు తితిక్షయే మిగుల

నరుడు. వారికిం బశ్చాత్తాపబుద్ధి కలిగిన దని యంటివిగాన, ఇఁక నేను వారల నిసుమంతయు బాధింపం బనిలేదు. నామంత్రప్రయోగముల నుపసంహరించుకొంటిని; వారికి యథాపూర్వముగ నింద్రియ శక్తుల నొసంగుచున్నాఁడను; వారు ప్రకృతిగుణభూషితులై యుందురు. పొమ్ము. వారికి సంకెళ్లు వదిలింపుము.

ఆర్య:— పోయి వారి నిటకుఁ గొనివత్తును. (నిష్క్రమించును)

పరా:— సమస్త నదీనదహ్రద పుష్కరిణీతీర్థాధిదేవతలారా! సకలసముద్రాధి దేవతలారా! దుర్వార దూర్వారూప చమత్కృతులఁ గల్పించి వ్రజసతీమణులకు భీతిఁగొల్పు స్థలాధిదేవతలారా! కుక్కగొడుగుల నత్యద్భుతముగ క్షణమాత్రమునఁ బుట్టించి పెంచు క్షుద్రదేవతలారా! మీశక్తివిశేషముల నొక్కచో నొక్కపనికై కూర్చి మాధ్యందినమార్తాండచండదీధితులఁ గప్పఁగలిగితి; నిగ్రహింప నసాధ్యతమము లగు మహావాతముల సైతము వశపరచుకొనఁగలిగితి; నీల ఘృణీజాలతృణీకరణచణకాలిమతోఁ జాల నొప్పు నుదధితతికిం ద్యుమండల వాయులోకమునకుం బోరు గల్పించి, వెన్నుని విశ్వరూపబాహుళ్యంబున నొక్కటి యగు నశ్వత్థము మొదలగు వృక్షరాజంబులపైఁ బిడుగులు పడునట్లు చేసి చీల్చివైచితి; సంద్రంబులం జొచ్చి యుండు భూమ్యగ్రంబుల గడగడ వడఁకునట్లు

చేయఁ గలిగితి; దేవదారు పున్నాగాది మహానగం
బుల మొదళ్లు కదలఁ బెకలింపఁ గల్గితి; నాయాజ్ఞకు
వెఱచి చిరనిద్రం జెందిన యోదరి ప్రేతచేతస్సులో లేచి
చేతనకృత్యంబులు సలుపునట్లు చేసితి. ఇట్టి కామ్య
మంత్రసద్ధులకై యిఁకఁ గాలహరణముం జేయనోపను.
ఈపని పూర్తి యగుటతోడనే, దివ్యసామగానము
లతోఁ బవిత్రీకృతుఁడనై, నామంత్రయోగ దండాది
సాధనజాతము నంత భూమిలోఁ బూడ్చివైచెదను;
నామంత్రగ్రంథములంగూడఁ గొన్ని నిలువులలోతునఁ
బూడ్చివైచెద. ( గభీరగానము )

( ఆర్యదాసుఁడు, కాంచ్యుని, నతనివెంబడి భీతముఖ
వైఖరితో నిశాంశుని, ఆత్రేయ వారణాసికులతో
దుఃఖపీడిత ముఖవైఖరిఁగల శివాస్త్యయ నాంధనరు
లను బిలిచికొనివచ్చును. పరాత్పరుఁడు చేసిన మాం
త్రికవలయ యంత్రమునంగూడి మంత్రోచ్చాటితులై
నిలుతురు; అట్టిస్థితిలో వారింజూచి, యిశాంశునితో.)

పరా:—చీకాకునొందిన చంచలచిత్తములకుఁ బూర్ణశాంతిం
గలిగించు పవిత్రసామగానము మిక్కిలి యుడుకుచున్న
నీచిత్తము నిప్పటి యున్మత్తస్థితినుంచి యెత్తి యుద్ధ
రించునుగాక ! అక్కడనే నిలుచుండుఁడు. ఏలన,
మీరు మంత్రితంబగు వలయమున నున్నారలు.
(కాంచ్యునితో) పవిత్రహృదయుఁడవైన కాంచ్యుఁడా!
నీ బాష్పధారలం గార్చుచున్న కన్నుఱెప్పలకు నీడు

జోడుగనున్న నా నయనయుగళమును గన్నీటిని మున్నీరుగాఁ గార్చుచున్నయది. నా మంత్రబలమును దగ్గించినాఁడను. బ్రాహ్మీముహూర్తంపు టుషఃకిరణకలికలు క్రమక్రమముగ విచ్చి వ్యాపించి యుదయరక్తిమయుక్ జీఁకటుల వాకిటనుండియే తరిమివైచి, మాధ్యందినంపుఁజండిమయు సాయంతనంపు సువర్ణంపుఁబసిమితోడి కెంపును సొంపుగఁ దెలియరానీకయే తాల్చుచుండునో, అట్లే పునర్జాయమానసమస్తజ్ఞానకర్మేంద్రియక్రియాంకూరములును వారి నింతవరకు మైకమువలెఁ గప్పి యావరించిన మాయాధ్వాంత సంతతులనుండి వెలువడుచున్నయవి. (తిరిగి కాంచ్యునితో) యోగ్యతతో నన్ను రక్షింప నుపాయములఁబన్నిన యో కాంచ్యుఁడా! నీ స్వామిభక్తి కొనియాడఁదగినది. మనోవాక్కాయకర్మల నాకృతజ్ఞతను నీయెడఁ జూప యత్నింతును. (తిరిగి యిళాంశునితో) ఇళాంశా! నన్నును నాచిన్నికన్నియను నీ వెంతటిక్రూరహింస చేయ సమకట్టి యుంటివి! నీకీఘోరకృత్యమునం దోడుగ నీతమ్ముఁడె నిలచెనుగా! (శివాస్త్యయునితో) శివాస్త్యయనా! నీకిప్పటికైనఁ బశ్చాత్తాపబుద్ధి కలిగినదా? (అంధనరునితో) రక్తమాంసపరికృతులంబట్టి మనుజుఁడవై యనుజుఁడవయ్యు నీ దురాశాపిశాచము నీజన్మప్రకృతినిగూడ మార్చివైచి, పశ్చాత్తాపముంగూడఁ గెంటివైచెగా! మీ

రుభయులును మీరాజునుగూడ నమ్మించి స్వామి ద్రోహులై వంచించి చంప నింతకుముం దెంచితిరిగా! మీా మహాపాతకకృత్యము లెంత ఘోరతమములైనను, నేను మిమ్ముల క్షమించితి. వారి జ్ఞానబీజము లుబ్బి యంకురములై యున్నవి. ఈ విజ్ఞాన వీచికలపోటున విజృంభించి కలుషితమైన విమర్శన శక్తిని శుద్ధపరచి వేలావధికముగ వ్యాపింపఁ జేయఁగలదు. (స్వగతము) వీరిలో నొక్కఁడును నన్ను గుఱుతుపట్టఁజాలకున్నాఁడు. (ఆర్యదాసునితో) ఆర్యదాసా! నా స్వభావసిద్ధమగు దుస్తును నాగదినుండి తెచ్చి యిమ్ము.

(ఆర్యదాసుఁడు నిష్క్రమించును)

(స్వగతము) మలినహీనపురియం దున్నప్పటి నా నిజరూపమును ధరింతును గాక! త్వరితము (ఆర్యదాసునితో) రమ్ము. నీకు సంపూర్ణస్వాతంత్ర్యదానము నిదె యొక్క నిముసమునఁ జేయువాఁడ.

(ఆర్యదాసుఁడు తిరిగి ప్రవేశించి పరాత్పరునికి దుస్తుల దొడుగుచుం బాడుచుండును.)

ఎందుల నెందుల నిందిందిరములు చిందులవైచుచుఁ బాడెడునో
సుందుల గొందులఁ గింజల్కంబులఁ జక్కఁగ దూరుచుఁ
[ గ్రోలెడునో
విందుగ మకరందానుపమామృతవీచుల నూగుచు సోలెడునో
నందపువై హాయస స్వేచ్ఛాగతి నాకిఁక లభ్యం బయ్యెడుఁగా॥

రాత్రుల నులూకజాతం
బాత్రముతోఁ గదలునపుడు యామినులందున్
బాత్రమగు కుసుమవితతిన్
జైత్రాంతములందు డాగి సరగ నెగురుదున్

పరా:- ఆర్యదాసా! ఇదియేమి! నన్ను వదలిపెట్టిపోవ నీ కింత సంతోషమా! నిన్ను వదలియుండ నాచేత నగునా! కానిమ్ము! నీకుం బూర్ణస్వాతంత్ర్యమును వాగ్దానము చేసినమాట సత్యమే! పోనిమ్ము. అట్లే కానిమ్ము. కాని, నీవు కామరూపాదివిద్యలు కలవాఁడవు గానం బోయి, తీరమున రాజు నావమీఁద నంత ర్భాగమునందు నిద్రించుచున్న కళాసులం జుక్కాని వాని నిటకుఁ గొనిరమ్ము. వేగమ పోయిరమ్ము.

ఆర్య:- నా వేగమే సదాగతి జాతీయముకదా! మీ నాడి రెండు కదలికలం జూపక మునుపే తిరిగ వచ్చెద?

(నిష్క్రమించును.)

కాంచ్యు:- ఈ ద్వీపమున సమస్తమును వ్యధామయమును గష్టభూయిష్ఠము. ఈ ద్వీపవలయము సకలాశ్చర్య చర్యలకు నిలయము. ఈ భయంకరమగు దీవినుండి యే దేవతయైనఁ దొలఁగించి రక్షించును గాక!

పరా:- రాజా! దుఃఖముల పాలుచేయఁబడిన మిలనహీన పురి ప్రభువునగు నన్నుఁ దిలకించి సంశయము వాపు కొమ్ము. ఈ నేను భూతప్రేతాదికము కానని మీరు నమ్ముటకై యిదె నిన్నాలింగనము చేసికొనుచున్నాఁ

డను! ఇదె మీ కందఱికిని మనస్ఫూర్తిగ స్వాగత మొసంగుచున్నాఁడను.

ఇళాం:— నీవు నిశ్చయముగఁ బరాత్పరుఁడ వగుదువో కాదో, లేక, నన్నిదివరకు మోసపుచ్చిన యమూర్తంపు భూతములలో నొకఁడవో నేను నిశ్చయింపఁజాలను. నీ నాడులందు రక్తము మనుష్యసామాన్యమునకు వలెనే ప్రవహించుచున్నయది. ఇపుడు నీవు ప్రత్యక్షమయితివి కాన నా మనోవ్యధ, ఇతఃపూర్వ మెంత వెఱ్ఱియెత్తించి యున్నను, తగ్గుచున్న ట్లున్నయది. ఈ జాగ్రదవస్థ (ఇది నిజముగ స్వప్నమో, ఇంద్రజాలమో కానిచో) వికసించి, వికసించి, అనేకాద్భుతముల వెలిపుచ్చఁగలదు. నీ ప్రభుత్వమునకు నే నిఁక నాశపడను; మఱియు నా పాతకకృత్యముల నన్నిటిని మన్నించి నాపై ననుకంపమును జూపింప వేడుచున్నాఁడను. పరాత్పరుఁ డింకను జీవించి యుంటయు, ఇచ్చట నునికియు, ఏరీతి సంభవించెనో నిశ్చయింపఁ జాలకున్నాఁడను.

పరా:— (కాంచ్యునితో) విలువలేని గౌరవార్హతకల యీ వయోవైఖరితో నొప్పు ని న్నాలింగనము మున్ముంద చేసెద.

కాంచ్యు:— ఇది స్వప్నమో, జాగ్రత్తో, ఇంద్రజాలమో నే నెఱుఁగఁ జాలఁ గాని —— మౌనమే వహింతు.

పరా:- ఈ వింతలదీవిలోని విచిత్రంపుఁబొంతల నుంటుఁజేసి యిది జాగ్రదవస్థయని మీరు నమ్మకున్నారలు. నా యీస్నేహితుల కందరికిని స్వాగతము. (శివా స్త్ర్య యనాంధనరులను జూచి) మీ రిద్దఱు చేయనెంచిన రాజహత్యను వెలిపుచ్చి, ఈ రాజునకు మీమీఁద నాగ్రహ మంకురింపఁజేసి మీ నాశనమునకుఁ గారణ భూతుఁడను గాఁగలను. మీ రాజద్వేషమును సయుక్తికముగ సనిదర్శనముగ నిరూపణ చేయఁగలను; కాని, మీపైనం జాడీలు చెప్పి యిఁక మిమ్ముల బాధింపను.

శివా:- (అపవారితముగ) మన రాక్షసకృత్యచింత లీతఁ డెఱుంగున ట్లీతనిమాటలే చెప్పక చెప్పెడు. ఇది భూతమే యై యుండునా?

పరా:- నేను భూతమనుగాను గీతమనుగాను. దుర్మార్గశిఖామణీ! నిన్నుఁ దమ్ముఁడా యని పిలుచుటకుఁ గూడఁ దగవు! అయినను, నీ మహాత్తమములయిన తప్పులను గూడ నే క్షమించితి. నీ తప్పుల నన్నింటిని క్షమించితి. నీ వపహరించిన నా రాష్ట్రమును నాకిమ్ము. దానిని, నే నడుగ నవసరము కలిగింపక యే, నీ యంతట నీవే నా కిత్తువు లే!

ఇళాం:- నీవు పరాత్పరుఁడవే యైనయెడ, నీవు కుశలముగఁ గష్టసాగరమును దరించిన వృత్తాంతముం జెప్పుము. మూఁడుగంటల క్రింద నావ పగిలి యెట్టులో యీ

గట్టునెక్కిన మమ్ము నీవెట్లు సంధించితివో చెప్పుము. ఈదేవి నేమందును! మందుఁకుగూడ నీనాపుత్రస్మృతి యను బాణముమైన తగిలెనేని, నొచ్చుకొనును. ఈశ్వరా! నా ప్రియనందనుం డెందున్నాఁడు?

పరా:- అయ్యా! తమకు సంప్రాప్తమైన కొరంతకు మిగుల నొచ్చుకొనుచున్నాఁడను.

ఇళాం:- ఈ దుఃఖ మనివార్యము! ఓర్పుకూడ దాని నసాధ్య తమ మనుచున్నది

పరా:- నీ వాకుమాదేవి యండం జక్కఁగఁ జేరలేదని యెంచెద! ఆదేవి యనుగ్రహ మహిమచే నేనిట్టి దుఃఖాంబుధి నుండియే యుద్ధరింపఁబడితిని.

ఇళాం:- ఏమి? నీకును, ఇట్టి దుఃఖమే సంభవించెఁగా?

పరా:- నీ కది యెట్టి యభినవమగు గొప్ప దుఃఖమో, నాకును మత్పుత్రికా విషయదుఃఖ మట్లే! నీకా దుఃఖతైక్ష్ణ్యమును మరచుటకుఁ గొన్నిమార్గముల నీశ్వరుఁడు కల్పించి యున్నాఁడు; నా కట్టి మార్గములు లేవు.

ఇళాం.- కుమారికయా? ఈశ్వరా! వారిరువురు నవపురిలో నిపుడు రాజును రాణియునై యుండి, నేనే నాకుమారుఁ డేలోకమున కరిగినట్లు సంశయించి దుఃఖించుచుంటినో యట్టి సముద్రాధోభాగమునఁ బడి మృతుఁడనైనం బాగుగ నుండెడిఁగా! నీ కూఁతు రెందు మాయ మయ్యె?

పరా:- ఈ గడచిన మహావాతూలహతిచే. ఈ మంత్రివర్గము, ప్రస్తుతము వ్యక్తమైన స్థితిగతులకు మిక్కిలి ఆశ్చర్యముం జెంది, విమర్శనశక్తిం బోఁగొట్టుకొని, వారి నేత్రములు యథార్థజ్ఞానమునకుఁ గరణములనిగాని, వారి వాక్ప్రపంచము స్వప్నమయము కాదనిగాని, నమ్మఁజాలకున్నారు. కాని, మీరు మీమీ జ్ఞానేంద్రియజన్యజ్ఞానము నెంత నమ్మఁజాలకున్నను, నేను సత్యమును జెప్పెద, వినుఁడు; నేనే పరాత్పరుఁడను; నేనే యశ్శరి వెడలఁగొట్టఁబడిన మలినపురీశుఁడను. ఆ నేనే మహావాతూలహతిచే నీ దీవిం జేరి దీనికిఁ బ్రభువు నైతిని ఈ వింతలగు పరిస్థితులం గూర్చి మనము ముచ్చటించుకొన్నది చాలును; దానిం గూర్చి యెన్నిదినములు ముచ్చటించినను దరుగదు; ఈ యుదయ భోజనసమయమున ముచ్చటించుకొన్న మాత్రమున ముగియదు. ఈ ప్రథమ సమావేశమున హెచ్చరింపఁదగినపురాణము కాదు. అయ్యలార! మీ కియ్యదె స్వాగత మొసంగుచున్నాఁడను. ఈ గుహాగృహమే నా కొలువుకూటము. ఇచ్చట నాకుఁ బరివారవిశేష మేమియు లేదు. పాలితప్రజయు శూన్యమే. దయచేయుఁడు. లోనివైపు తిలకింపుఁడు. నా సామంతప్రభుత్వము తిరిగి నావశము చేసితిరిగాన, దాని కనుగుణమగురీతిన నే మీకుఁ బ్రత్యుపకారము చేసెద. నాచేత నెక్కువలు సాధ్యము కాకున్నను,

ఒక చిత్రమగు విప్రవినోదపు వింతనుజూపి, నన్ను మీరెట్లు మెప్పించితిరో, అట్లే మిమ్మును నేను మెప్పింపఁ జూచెద ! (గుహావాకిలి తెరవఁబడును, మిహిరాండభారతియుం బ్రతినందుఁడును జదురంగ మాడుచుఁ గానఁబడుదురు.)

మి. భా:- మనోహరా ! నన్నీయాటలో నేల మోసపుచ్చెదరు ?

ప్రతి:- నా ప్రియతమయగు నర్ధాంగీ ! ఛీ ! నిన్ను మోసపుత్తునా ? ప్రపంచచక్రమునకైనను, నేను మోహాపడి, మోసమున కంగీకరింపను.

మి. భా:- ప్రాణనాథా ! మీరెన్ని చక్రవర్తి పదవుల కాసపడి నన్నాటలో మోసగించి యోడించినను, నే నామోసమునకు కోపపడక యదియు నొక సత్యంపు వేసమేకాని మోసమే కాదందు.

ఇళాం:- ఈ కనఁబడువింత యీ మంత్రకల్పిత ద్వీపముయొక్క చిత్రకల్పనయైనను గానిమ్ము, నా ఘాత్రశోకము నొక సారికాదు, రెండు పర్యాయములు సంభవించినను బోఁగొట్టఁజాలు నద్భుతానందమును గలిగించుచున్నది.

శివా:- మిక్కిలి యద్భుతతమము ?

ప్రతి:- (ఆట విడచి లేచి) సముద్రుఁడు, గంభీరుఁడై బెదరించినాఁడే కాని, నిజముగా దయార్ద్ర హృదయుఁడే. సముద్రమహావాతాదుల నిష్కారణముగ నిందించినాఁడను. (అనుచు ఇళాంశుని పాదములపైనఁ బడును)

ఇళాం:— ఆనందభరితుఁ డగు తండ్రి యెన్ని యాశీర్వచన వర్ష ములఁ గురిపించునో యవన్నియు నిను ముంచివేయుం గాక! లెమ్ము. నీ విచ్చటికి నెట్లు చేరితివో చెప్పుము.

మి. భా:— (తనలో) ఆహా! ఏమివింత! ఎట్టి స్ఫురద్రూపములు నేఁడిటఁ గానవచ్చుచున్నవి! మనుష్యజాతి యెంత సౌందర్యము కలది! నేఁడెంత క్రొత్తప్రపంచము యొక్క సొంపు వీక్షింపఁగలిగితిని!

పరా:— నీ వింతవరకుఁ జూచి యుండలేదు, కావున నీకింత చిత్రముగా నున్నది.

ఇళాం:— నీతో నింతవరకు నాడుచున్న కన్యక యెవతె! నీ కీమెతోఁ బరిచయ మీయామమునకుఁ బూర్వ ముం డుటకు వీలులేదు. మనల నుభయులను విడఁదీసి తిరిగి, కూర్చినదేవత యీమే యైయుండునా?

ప్రతి:— తండ్రిగారూ! ఈమె దేవతగాదు; మానిసియే! కాని, అమృత స్వరూపుఁడును సర్వసంధాయకుఁడు నగు పరమేశ్వరుని యనుగ్రహముచే నీమె నాయర్ధాం గియైనది. నాతండ్రి లేఁడను దుస్థితి సంభవించినట్లు, మీ యనుమతి పొందకయే యీమెను స్వీకరింపవలసి వచ్చెను. ఆ సుప్రసిద్ధుఁడగు నమలినపురి ప్రభువగు పరాత్పరుని కూఁతురే యీమె. ఆయన ప్రఖ్యాతిని బహుజనులచే వినియుంటిని గాని, వారి నింతవరకుం జూచి యెఱుంగను. వారి యనుగ్రహమే నాలో

రెండవసారి ప్రాణప్రతిష్ఠ చేసెను. ఈ వధువుద్వారా వారు పితృసములగు మామగారైరి.

ఇళాం:- నేను నామెవాఁడనే యైతిని. నే నామెకుఁ జేసిన యపాయానర్థములకు నెంతయు నొచ్చుకొని పశ్చాత్తపించుచున్నవాఁడను. నన్ను క్షమింప నామెను వేడవలసియున్నది.

పరా:- అయ్యా! ఆ విచారముతో నీకుఁ బనిలేదు. గడచిన కష్టముల స్మరణకుఁ దెచ్చుకొని చిత్తమునకు భారము కలిగించిన లాభ మిసుమంతయు లేదు.

కాంచ్యు:-లోలోనె కుందుచుండుటచే మాటలాడఁ జాలకుంటిని. ఓ దేవతలార! మమ్ముల గాపాడిన యీ వధూవరులపై మీ కటాక్ష వీక్షణంబులఁ బ్రసరింపఁజేసి దీవించి వారి శిరస్సులమీఁదఁ గిరీటంబులం బ్రసాదింపుఁడు. మీ యనుగ్రహము చేతనేకదా మేమిట్లు సురక్షితమగు మార్గముంబట్టి కడఁదేరితిమి?

ఇళాం:- కాంచ్యుఁడా! తథాస్తనుచున్నాఁడను.

కాంచ్యు:-పరాత్పరుఁడు మలినహీనపురినుండి వెడలఁగొట్టఁబడినందునకు ఫలము తత్సంతతికి నవపురి రాజ్యాధిపత్య మబ్బుటయే యైనది. ఇది యసామాన్యమగు సంతోషమునకు సమయ మనవచ్చును. అందరు నానందింపుఁడు. బంగారపు నీరుపోసిన శాసనములతో నీ యానంద సందర్భముల నాచంద్రార్కముగ వెలయింపుఁడు. ఒకసారి సముద్రయానము చేసి కళార్య

బలభుసీనగరమునఁ దనభర్తను గాంచి ధన్యురాలయ్యెను. ఆమె సోదరుఁడగు ప్రతినందుఁడు మఱియొక సముద్ర యానానంతరము తన ప్రాణరక్షణకాధార భూతమగు దీవిలో నొక ప్రాణనాయకినిఁ బరిణయమాయెను. పరాత్పరుఁ డొక మనుష్యరహితమగు ద్వీపమునందుఁ జిక్కియుఁ దన సామంతప్రభుత్వపదవినందెను. అట్లే మనమందరమును బునర్జన్మ మెత్తినట్లైనను కుశలులమై యున్నారము.

ఇళాం:- (ప్రతినంద మిహిరభారతులతో) మీ హస్తముల నిట్లిండు. ఈ వధూవరులను సర్వసంపదలను జెందుదురుగాక యని దీవింపనివాని హృదయము నిరంతరము దురంతచింతావహ మగుఁగాక !

కాంచ్యు:-తథాస్తు. అట్లేయగుఁగాక !

(ఆశ్చర్యమగ్నులైన కెప్తానును గళాసిమేస్త్రీను వెంబడి పెట్టుకొని యూర్యదాసుఁడు ప్రవేశించును.)

ఓహో! ప్రభూ! అటు చూడుఁడు! మనవారలలో మఱికొందరు వచ్చుచున్నారలు. చావుమూడియున్నను వీఁడు సముద్రమున మునుఁగువాఁడు కాఁడని నేనెఱుక చెప్పియుండలేదా! ఏమిరా! తిట్టుబోతూ! ఓడ ప్రయాణములో నీతిట్లకు వెఱచి భగవత్ప్రసాదము పారిపోవుచుండెడిది. నినోట నొక యొట్టైన వినఁబడ

దేమి? సముద్రమునుండి నేలమీఁదఁ జేరఁగనే నీ నోరు మూతపడిపోవునా యేమి! ఏమి విశేషాలు.

కెప్టె:—సర్వోత్తమమైన విశేష మేదన: మన రాజుగారినిఁ బరివారమును గుశలగతిం జూడఁగలుగుటయే! దాని తరువాత, మూఁడుగంటలక్రింద మునిఁగి తుత్తునియలై పోయినదని తలఁచిన మనయోడ చెక్కుచెదరక దృఢమై యొక్క తెరచాపగాని త్రాడుగాని చెడి పోక మనము బయలుదేరిననాఁ డున్నట్లె యున్నయది!

ఆర్య:—(పరాత్పరునితో) అయ్యా! ఈ కార్యమంతయు నే వెడలుచునే చక్కఁబెట్టితిని.

పరా:—(ఆర్యదాసునితో) నీ నేర్పులును జిత్తులును సామాన్యములా?

శాం:— ఈ సంఘటనములు కేవల ప్రాపంచిక స్వభావము కలవికావు. దైవికములు. వాని యాశ్చర్య వైఖరి క్షణక్షణే యాశ్చర్యతరమగు చున్నది. మీ రిక్కడ కెట్లు చేరితిరో చెప్పుఁడు.

కెప్టె:— ఇది కల కాదా యను సంశయము నెట్లో కుదుట పరచికొని, ఎట్లో చెప్పఁ బ్రయత్నించెద. మేము గాఢసుషుప్తి నుంటిమి. అది యెట్లు సంభవించెనో నేఁ జెప్పఁజాలనుగాని, అందరమును మన యోడ యొక్క గర్భభాగమున బల్లకూర్పు తలుపు క్రింద నుండఁగా, విచిత్రములగు గర్జనాదిమహాశబ్దములు,

అరపులు, గొలుసుల చప్పిడులు, పెద్ద కేకలు మొదలగు భయంకరమగు శబ్దకల్లోలముచే మేలుకొంటిమి. వెంటనే, మాకుఁ బూర్ణస్వాతంత్ర్య మబ్బెను. బయటికి వచ్చినతోడనే మన యుత్తమ మగు రాజనౌక యథాపూర్వసౌష్ఠవముతో దర్శన మిచ్చెను. మన మేస్త్రీ యాస్థితికి సంతసించి నాట్యమాడ సాగెను. క్షణమాత్రములోనే మే ముభయులము, స్వప్నమందు వలె, మీాకడ కిట్లు తేఁబడితిమి. తక్కిన కళాసీ లోడ వద్దనే యున్నారలు.

ఆర్య:— (పరాత్పరునితో) ఏమి? నా కృత్యమును జక్కఁగ నెరవేర్చితినా?

పరా:— (ఆర్యదాసునితో) యథావిధిగా నెరవేర్చితివి. చురుకు తనమే యవతరించినట్లు నీ పను లొప్పెడు. నీకుఁ బూర్ణస్వాతంత్ర్యము నిదే యొసంగెద.

ఇశాం:— ఇది యగమ్యగోచరమగు విచిత్ర మార్గనైఖరి. ఇందు నైసర్గికమగు క్రియాడంబర మిసుమంతయు లేదు. ఇది ప్రపంచాతీతము. మన బుద్ధుల కేమహాత్మ్యలో మెఱుక యను వెలుతురును బ్రసాదింపవలయును.

పరా:— మా రాజా! ఈ వింతలగు సంఘటనలమీాఁదనే బుద్ధి నుంచి కలవరము నొందకుఁడు. మనకుఁ దీరుబడి యగుటతోడనే, అందునకు నెక్కువ వ్యవధి లేదన

వచ్చును. ఈ జరిగిన విస్మయావహములగు సమస్త కార్యములం గూర్చియు సవిస్తరముగ విస్పష్టమగు నట్లు నే నుపన్యసించెద. అప్పుడు మీకు నమ్మిక చిక్కఁగలదు. అంతవరకు, శాంతము వహించి జరుగు చిత్రములం దిలకింపుఁడు,

(ఆర్యదాసునితో) ప్రమథవరా! ఇటురమ్ము. నీవు మంత్రోచ్చాటనము చేసి, కాళీవనాదుల విడుదల చేయుము. (ఆర్యదాసుఁడు నిష్క్రమించును.) తమ మనస్సునకు శాంతి చిక్కినదా? మీరు తెచ్చిన పరివారములోని కొందరు మిగిలియున్నారు. వారును రాఁగలరు.

(కాళీవనాదులు దొంగిలించిన వస్తులతో నార్యదాసుని వెంబడి ప్రవేశింతురు.)

శ్రీవ:— ప్రతిమనుజుఁడును బరోపకారియై వర్తించుఁగాక! స్వార్థపరదృష్టిని వదిలియుండుటయే మేలు! ఏలన, సర్వము నదృష్టవశము. ధైర్యమును వహింపుము, రక్షసీ.

త్రియంచ.—ఈ నాశిరస్సునందలి నయనద్వయము నిజముగ నేత్రేంద్రియములే యైనయెడ, ఇదియొక చిత్రమైన వినోదదర్శనమే.

కాళీ:— ఓ సేతువాసిరక్షోనాథా! ఇవి యెంతవింతలగు విగ్రహములు! నా యజమానుని విగ్రహముకూడ నెంత

బాగున్నది? నన్నెంత శిక్షించునో యితఁడని భయము పుట్టుచున్నది.

శివా:— ఆహా! అంధనరప్రభూ! ఇవి యెట్టివస్తువులు? డబ్బుతోఁ గొనఁదగినవి యగునా?

అంధ:— అట్లే కానవచ్చుచున్నవి! వానిలో నొకటి చేపవలె నున్నది; కావున, నిస్సంశయముగఁ గొనఁదగినదే.

పరా:— ఏల మీర లీలీల విస్మయభ్రాంతచిత్తు లగుచున్నారలు? ఈ సేవకుల డవాలీలలోని రాజచిహ్నముల గురుతుపట్టి, పిదప నవి మిథ్యలో సత్యములో గమనింపుఁడు. ఈ కురూపియగు దొంగను దిలకించితిరా? ఈతనితల్లి యొక గొప్పమంత్రగత్తెయై యుండెను. దాని మంత్రశక్తిచేఁ జంద్రమండలమును, సముద్రం టాటుపోటులను, దన వశమున నుంచుకొనఁగలిగి యుండె. చంద్రమండల స్వభావశక్తులే ప్రకృతిలోఁ గొన్నిమార్పులఁ జేయఁగలవు. ఇది చంద్రమండలమునే తన శక్తిలో నుంచుకొన్నది. ఆ రక్కసిపేరు సింహిక. ఈ మీయిద్దరు సేవకులును గురుతుపట్టఁబడి యున్నారుగదా! వీరు మువ్వురుంగలసి నా దుస్తులను వస్తువులను దొంగిలించిరి. భిన్నకులోత్పన్నుఁడగు నీ రాక్షసి, ఈ కురూపి, వీరితోఁగూడి నా ప్రాణముం దీయుటకై పన్నాగములఁ బన్నిరి. మీరు గురుతుపట్టిన యీ యిద్దరు నీక మీవశము. ఈ యసితాంగుఁడగు రాకాసిని నా వశములో నుంచుకొందును.

కాళీ:— (తనలో) ఇఁక నన్నుఁ బొడిచిపొడిచి చంపును గాఁబోలు.

ఇళాం:— వీఁడు నా ప్రాగుఁబోతుమహానసాధిపతి యగు క్షీవనుఁడు కాఁడో ?

శివా:— వీఁ డిప్పుడును దప్పఁ ద్రాగియే యున్నాఁడు. వీనికి నిక్కడఁగూడ నెట్లు మద్యము దొరికెనో !

ఇళాం:— త్ర్యించలుఁడుకూడ నల్లే సొక్కుచు సోలుచు నొడలెఱుఁగని స్థితిలోనే యున్నాఁడు. వీరి చిత్తమునకు నీరజోద్రేకమును గలిగించిన మహోద్రాఘోరస మెచ్చట వీరి కిచట నబ్బినదో ! మీ కీదుర్బుద్ధియు దురవస్థలు నేల సంభవించినవి ?

త్ర్యించ:— తమను వదలిన క్షణమునుండి నే ననుభవించుచున్న కష్టపరంపరలు నా యెముకలతోడి సంబంధముండువరకును మఱవఁజాలను. పైన వ్రాలిన యీఁగనైన విసరుకొనవలసిన యవసర ముండని దుస్థితిలో నున్నాఁడను.

శివా:— ఏల ? క్షీవనా ! ఇది యేమి యవస్థ ?

క్షీవ:— ఓ నన్ను ముట్టకుఁడు. నేను క్షీవనుఁడనుగాను; వాయు రోగంపుఁ బోటుల కుప్పను.

పరా:— ఈ ద్వీపమునకు రాజువు కాఁ దలఁచితివిగా ? దుర్మార్గుఁడా !

క్షీవ:— ఆపదవియే సంభవించి యుండిన, నేను ప్రజల కెట్టి దుష్టమగు కడుపులోని పుండు నగుచుంటినో ?

ఇళాం:— నే నింతవరకు నింత కురూపపు జీవినిఁ జూచియుండ లేదు (అనుచుం గాళీవసునిఁ జూపును)

పరా:— వీని యాకార మెట్టి కురూపమో, వీని బుద్ధియు నంత కుబుద్ధియే. — దుర్మార్గుఁడా ! బుద్ధి తెచ్చుకొని నా గదికిఁ బొమ్ము; నీతోఁగూడ నీ యీ స్నేహితు లనుగూడఁ దీసికొని పొమ్ము. నేను క్షమింపందగిన పశ్చాత్తాపబుద్ధి గలిగినది గానఁ బొందు. నాగది నూడ్చి యలంకరింపుఁడు.

కాళీ:— చిత్తము. అట్లే చేయుదును. ఇఁకమీఁద బుద్ధి తెచ్చు కొని మీ యనుగ్రహపాత్రుఁడ నగుటకుఁ బ్రయత్నిం చెద. ఈ త్రాగుఁబోతు నొక దేవతగా భావించి పూజించునంతటి గాడిద నెట్లయితినో !

పరా:— పో ! పో ;

ఇళాం:— వెడలుఁడు. వెడలుఁడు. ఈ దొంగిలించిన సరకుల నెక్కడనున్న వాని నక్కడ నుంచుఁడు. (కాళీవన క్షీవన త్ర్యంచలులు నిష్క్రమింతురు.)

పరా:— రాజా ! మిమ్మును, మీ పరివారమును నాయీ కుటీ రమున విందారగింప వేడుచున్నాఁడను. ఈ రాత్రికి

మీరిచ్చట విశ్రమింపుఁడు. చాలవరకు నాగతచరిత్రను గురించిన సంభాషణలోనె మీ కీరాత్రి నిస్సంశయముగఁ దెలియకయే గడచును. ఉదయమగుడు మిమ్ముల మీ యోడవద్దకుఁ జేర్తును. అంతట నవపురికి సముద్రయానముచేసి, అచ్చట నీ మనవధూవరుల వివాహ మహోత్సవమును సలక్షణముగ యథార్థముగ సాగింతుముగాక! అంతట నేనా యమలినపురిం జేరి నా శరీరత్యాగ సమయమున కీశ్వర ధ్యాననై రంతర్యయుక్తి స్వేచియుందును.

ఇళాం:- మీ జన్మాదివృత్తాంతమును విన నా మనము కౌతూహలాయత్త మగుచున్నది. అది తప్పక మహావినోద జనకమగు.

పరా:-దాని నంత సవిస్తరముగఁ జెప్పెదను. మీకు నిరాటంకమగు సముద్రయానము వాతూలాదులు లేకుండ ననుకూలవాయు కూపపట సంచాలనములతో సాగుంగాక! (ఆర్యదాసునితో) నా ప్రేమాస్పదుఁడవగు ప్రమథవరా! ఈకడపటి నీవు సానుకూలముచేసి, నీపూర్ణ స్వాతంత్ర్యమును గ్రహింతువుగాక! వాయ్వాకాశాది పంచభూతములందు నీయిచ్చకు వచ్చినట్లు మెలఁగెదవుగాక! (ఇళాంశాదులతో) లోనికి దయ చేయుఁడు.

(అందరు నిష్క్రమింతురు.)

## భరతవాక్యము.

---

(సూత్రధారుఁడు కాని, పరాత్పరపాత్ర కాని)

కాలవశంబిల సర్వజగమునుం
  గర్మవశంబగు జంతుగతుల్
మేలగుకోరిక లీగతిఫలన
  మ్మేళన నొప్పెడి పాపకృతుల్
జాలినిఁబూనక చేసినయెడలన్
  జన్మశతంబును గష్టతతిన్
దేలుట తప్పదు జాతులకును సం
  దేహము లేదిఁట వ్యక్తులకున్.



గుంటూరు, చంద్రికా ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.